స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు స్థాపితం: 1930 జీవప్రదాత: నెల్లూరు శ్రీరామమూర్తి
*Longest Living Newspaper in Telugu Journalism*
జమీన్‌రైతు
సంపుటి: 83 • సంచిక: 37 • 13-9-2013 శుక్రవారం • పేజీలు: 16 • విడి ప్రతి: రూ.5/-



# కాంగ్రెస్‌వాదుల కొత్త పార్టీ!

## • నాయకత్వ బాసికం కిరణ్‌కుమార్‌రెడ్డి తలకు కట్టనున్నారు.



ఇల్లు తగలబడి పోతున్నదని ఒకడు ఏడుస్తుంటే, చుట్ట కాల్చుకోవడానికి కావలిసినంత నిప్పు దొరికిందని మరొకడు తబ్బిబ్బైనాడట. ఆంధ్ర, తెలంగాణ వేర్పాటు ఉద్యమాల సెగలో రాష్ట్ర ప్రజల జీవితాలు బుగ్గిపాలైపోతుంటే, కొత్త పార్టీ పెట్టి అధికారం హస్తగతం చేసుకోవడానికి ఇదే సరైన అదను అని కాంగ్రెస్‌లో ఒక వర్గం నేతలు కుతూహలపడుతున్నారు.

సమైక్యాంధ్ర ఉద్యమం రాష్ట్ర రాజకీయ వాతావరణాన్ని తారు మారు చేసింది. ఒకటిన్నర నెల ముందు నాటికి, నేటికి రాజకీయ పరిస్థితులలో ఇసుమంత పోలిక కూడాలేదు. కేంద్రంలో అవినీతి, రాష్ట్రంలో అసమర్ధ పాలన, విద్యుత్ ఛార్జీల హెచ్చింపు, కరెంట్ కోతలు, ఎర్రగడ్డలు కిలో ఎనభై రూపాయలమ్మే దుర్గతి, ఆరు నెలల్లో అరడజను సార్లు పెరిగిన పెట్రోల్ ధరలు వంటి అనేక కారణాల వల్ల రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీ పరిస్థితి అయోమయంగా తయారైంది. ఎన్నికలలో పోటీ చేస్తే డిపాజిట్లు కూడా దక్కవని సీనియర్ మంత్రులు సైతం నిశ్చయానికి వచ్చేసి వుండినారు.

### నేనే పదేళ్లు సిఎం!

మరొకప్రక్క తాను ముఖ్యమంత్రి కావడం ఖాయం అనే నమ్మకంతో వుండినాడు వైఎస్‌జగన్. ఆ ఆశే ఆయనలో జైలు కష్టాలు సంతోషంగా భరించే శక్తినిచ్చింది. తనను కలవడానికి వచ్చే నేతలు కొందరితో ఆయన, "నేను రానున్న పదేళ్ల పాటు ఈ రాష్ట్రానికి ముఖ్యమంత్రిగా వుండడం ఖాయం, ఆ తర్వాత మరొక పదేళ్లపాటు ఈ దేశానికి నేనే ప్రధానిగా కూడా వుంటాను" అని చెప్పేవాడు. జనంలో తనకున్న ప్రాబల్యం మీద అంత నమ్మకమన్నమాట జగన్‌కు. వాస్తవంలో కూడా పరిస్థితి అట్లనే కన్పించింది. వైఎస్ మీద ప్రేమ వల్లనో, కాంగ్రెస్ మీద ద్వేషం వల్లనో ప్రజలు ఈసారి జగన్ చెప్పిన గుర్తు మీద ఓటు వేయాలనే నిర్ణయానికి వచ్చేసినట్లు కన్పించారు. ఆ పార్టీ నేతలైతే, ఇప్పుడే ఎమ్మెల్యేలైపోయినట్లు కలల లోకంలో తేలిపోయారు కూడా.

### తెలుగుదేశంలో నీరసం

మూడో ప్రక్క తెలుగుదేశం పార్టీలో నిరాశా నిస్పృహలు పెరుగుతూ వచ్చాయే తప్ప తరగలేదు. చంద్రబాబు ఈ అపర వయస్సులో రెండున్నర వేల కిలోమీటర్ల దూరం కాలినడకన వూరూరు చుట్టి వచ్చిన తర్వాత కూడా ఆ పార్టీ పట్ల ప్రజలలో అభిమానం కుసిమించిన దాఖలా కన్పించ లేదు. వరసగా మూడోసారి కూడా తమకు అధికార పీఠం అందని మాని పండు మాత్రమే అన్న నీరసం ప్రతి తెలుగుదేశం కార్యకర్త, నేతలో వ్యాపించింది.

ఎప్పుడు ఎన్నికలు జరిగినా, రాష్ట్రంలో రాజకీయ పరిస్థితి ఇంతే అన్న అభిప్రాయం అందరిలో నాటుకొని పోయింది.

### రాజకీయం తలక్రిందులు

అయితే సోనియాగాంధీ రాష్ట్ర విభజన నిర్ణయం ప్రకటించిన ప్రక్కక్షణం నుంచి పరిస్థితి ఒక్కసారిగా తలక్రిందులైంది. అప్పటి వరకు రాష్ట్రం మొత్తం మీద కాంగ్రెస్‌కు పది సీట్లయినా వస్తాయా, గతంలో కోట్ల విజయభాస్కరరెడ్డి స్థాపించిన 26 సీట్ల రికార్డును కిరణ్ కుమార్‌రెడ్డి తిరగ వ్రాయబోతున్నాడా అన్న చర్చలో వుండిన కాంగ్రెస్‌వాదులకు తెలంగాణ ప్రాంతంలో కొత్త ఉత్సాహం వచ్చింది. ప్రత్యేక రాష్ట్రం ఇచ్చిన దాతగా కాంగ్రెస్ పార్టీని, సోనియాగాంధీని తెలంగాణ ప్రజలు అక్కున చేర్చుకోబోతున్న సుందర దృశ్యం వారి మనో ఫలకాలలో ఆవిష్కృతమైంది. తమ పార్టీ మీద అపనమ్మకంతో, టిఆర్‌ఎస్ అధినేత కెసిఆర్‌తో బేరం కుదుర్చుకొని పార్టీ మారిన వివేక్, మందా జగన్నాధం వంటి ఎమ్పీలు అయ్యో తప్పు చేశామే అనే బాధతో నలిగి పోతున్నారు.

### జగన్ తప్పటడుగు!

ఇదే సమయంలో వైఎస్ జగన్ రాజకీయంగా పెద్ద తప్పటడుగు వేశాడు. ఆయన మొదట నుంచీ సమైక్యవాది. మూడేళ్లక్రితమే లోక్‌సభలో సమైక్యాంధ్ర నినాదంతో కూడిన ప్లేకార్డు పట్టుకొని సంచలనం సృష్టించాడు. ఆ సంగతి తెలిసి కూడా తెలంగాణ ప్రజలు ఆయన్ను ఆదరించారు. షర్మిల పాదయాత్రకు అడుగడుగునా నీరాజనాలు పట్టారు. తెలంగాణ విభజనలో జగన్ పాత్రను పట్టించుకోలేదు. కానీ జగన్ మాత్రం విభజన ప్రకటన పట్ల తనకుమాలిన ధర్మంతో వ్యవహరించాడు. తెలంగాణ ఇచ్చేది తాను కాదు, ఆ నిర్ణయంలో తన ప్రమేయం శూన్యం అన్న నిజాన్ని విస్మరించి, ఆ ప్రకటనకు వ్యతిరేక వైఖరి అవలంభించాడు. సమైక్యాంధ్ర వైపు

కొరవ 14వ పేజీలో

## సుఖ ప్రసవమా - గర్భస్రావమా?

సంతానం కావాలనే కోరిక కలిగితే గర్భం ధరించడం సహజం. కానీ ఆ కోరిక తీరాలంటే తొమ్మిది నెలలు ఓపిక పట్టాలి. అప్పుడు సుఖ ప్రసవం జరుగుతుంది. పండంటి బిడ్డ పుడతాడు. కానీ మధ్యలోనే తొందర పడితే...? జరిగేది గర్భస్రావం మాత్రమే. అటు బిడ్డా దక్కదు, ఇటు ఆరోగ్యమూ పాడౌతుంది. తెలంగాణ ఏర్పాటు విషయంలో సోనియాగాంధీ వైఖరిని నాలుగు నెలల్లోనే బిడ్డను కనాలన్న తొందరతో పోల్చాడొక సీనియర్ కాంగ్రెస్ నేత. సోనియాగాంధీకి తెలంగాణ ఇవ్వాలనే కోరిక కల్గింది. మంచిదే. కానీ అందుకు తగిన వ్యవధి తీసుకొని, అన్ని సమస్యలూ పరిష్కారం చేసి, ఆ తర్వాత రాష్ట్ర విభజన తలపెడితే, సుఖ ప్రసవం మాదిరి వుంటుంది. తొందరపడి నవంబర్‌లోగా, డిసెంబర్‌లోగా తెలంగాణ ఏర్పాటు జరిగి పోవాలనే దూకుడు తత్వానికి వెళ్తే గర్భస్రావం వంటి చెడు ఫలితాలు వుంటాయి... అన్నాడా సీనియర్ నేత. సోనియాగాంధీ ఎంత గింజుకున్నా 2014 ఎన్నికల వరకు తెలంగాణ ఏర్పాటు అసాధ్యం అన్నది ఆయన అభిప్రాయం. నమ్మకం కూడా. ఈ వాదనతోనే ఆయన ఢిల్లీలో ఆంధ్ర ప్రాంతం ఎమ్పీలను కూడగట్టి, అధిష్టానం మీద ధిక్కార స్వరానికి ధైర్యం నూరి పోశాడు.

## గోతికాడ నక్కలని జమీన్‌రైతు ముందే చెప్పింది!

రాష్ట్ర విభజన జరిగితే, తామే ముఖ్యమంత్రులౌతామని కొందరు కేంద్ర మంత్రులు, రాష్ట్ర మంత్రులు కూడా గోతికాడ గుంట నక్కల వలె కాచుకొని వున్నారని, ఊహలలో తేలియాడుతున్నారని రెండు వారాల క్రితం 'జమీన్‌రైతు' పత్రిక వ్యాఖ్యానించింది. ఇప్పుడు తాజాగా విజయవాడ ఎమ్పీ లగడపాటి రాజగోపాల్ అదే విషయాన్ని ప్రకటించాడు. తెలుగు తల్లి తల తెగనరకమని కొందరు ఆంధ్ర ప్రాంతం కేంద్రం మంత్రులే అధిష్టానానికి సలహా ఇస్తున్నారు. రాష్ట్రం విడిపోతే ముఖ్యమంత్రి పీఠం అలంకరించాలని కలలు కంటున్నారు, వారి పేర్లు తర్వాత బయట పెడతాను అని ప్రకటించాడు లగడపాటి. కానీ ఈ విషయాన్ని రెండు వారాల క్రితమే 30తేది సంచికలో పాఠకులకు తెలియజేసింది 'జమీన్‌రైతు' పత్రిక. ఆంధ్ర ప్రాంతం నుంచి చిరంజీవి, బొత్సా, పనబాక లక్ష్మి, పురంధేశ్వరి; తెలంగాణ ప్రాంతం నుంచి జైపాల్‌రెడ్డి, దామోదర రాజనర్సింహ ముఖ్యమంత్రి అయిపోయినట్లే పగటి కలలలో తేలియాడుతున్నారని వివరంగా పేర్లతో సహా ప్రచురించింది.

# ఓట్ల కోసం హత్యలా?

ఉత్తరప్రదేశ్‌లోని ముజఫర్ నగర్ జిల్లాలో వున్నట్లుండి మత కలహాలు విజృంభించాయి. గతవారం రోజులలో దాదాపు 40 మంది మరణించారు. కేంద్రం నుంచి సైన్యాన్ని తరలించినా పరిస్థితి అదుపులోకి రావడం లేదు. ప్రధాన పట్టణంలో కర్ఫ్యూ విధించి, పోలీసు పహారా కాస్తుంటే పరిసర గ్రామాలలో మత విద్వేషాల మంటలు దావానలం వలె వ్యాపిస్తున్నాయి. మరొక ప్రక్క చుట్టుపక్కలున్న షమిలి, బాగ్‌పట్, మీరట్ వంటి జిల్లాలకూ పాకిపోతున్నది. ఇప్పటికే ముజఫర్‌నగర్ జిల్లాలోని వివిధ గ్రామాలకు చెందిన 30 వేల మంది గ్రామీణులు ఇల్లు వాకిలి విడిచిపెట్టి, ప్రాణాలరచేతిలో పెట్టుకొని వలస వెళ్లిపోయారని అంచనా. పోలీసుస్టేషన్లలో, దూర ప్రాంతాలలోని బంధువుల ఇళ్లలో తలదాచుకొంటున్నారు వారు. అధికారులు ఎంత ధైర్యం చెప్పినా తమ గ్రామాలకు తిరిగి వెళ్లడానికి సాహసించడం లేదు.

ముజఫర్‌నగర్ జిల్లా కానీ, నగరం కానీ గతంలో మత కలహాల చరిత్ర కలిగినవి కావు. దేశ విభజన సమయంలో కూడా ఈ ప్రాంతంలో మత విద్వేషాలు చెలరేగలేదని స్థానికులు చెప్తున్నారు. అంత సామరస్య వాతావరణంలో బ్రతికే వాళ్లు మత కార్చిచ్చుతో మసై పోవడానికి కారణం ఏమిటన్నది ప్రశ్న. ముజఫర్‌నగర్‌లోని ముగ్గురు ఆకతాయి పిల్లలు ఒక యువతిని ఆటపట్టించారట. ఈవ్ టీజింగ్ అనేది అన్ని వూళ్లలో అత్యంత సాధారణంగా జరిగే సంఘటన. కానీ స్వల్ప విషయమే ఆ నగరం పాలిట శాపంగా మారింది. అల్లరి చేసిన ముగ్గురు యువకులూ ఒక మతానికి చెందినవారు కావడం, మరొక మతానికి చెందిన దుండగులు వారి మీద దాడి చేసి కిరాతకంగా చంపడంతో అల్లర్లు మొదలైనాయి. విచిత్రం ఏమిటంటే ఈ దాడి జరగడానికి కొన్ని గంటల ముందే, కేంద్ర హోం మంత్రి సుశీల్‌కుమార్ షిండే ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రికి ఫోన్ చేసి మీ రాష్ట్రంలో మత కలహాలు చెలరేగబోతున్నట్లు సమాచారం వచ్చింది, జాగ్రత్తగా వుండండని హెచ్చరించాడట. అంటే దాని అర్థం, ఆకతాయి పిల్లల అల్లరి, వారిపై దాడి అనేది కాకతాళీయంగా జరిగిన దుర్ఘటనలు కావు, ఒక ప్రణాళిక ప్రకారం ఎవరో ముందుగానే వ్యూహం రచించుకొని మరీ ఈ అకృత్యానికి ఒడికట్టారు అని.

కేంద్ర మైనార్టీ శాఖ మంత్రి రెహమాన్ నేరుగా నిజం చెప్పేశాడు – రాబోయే పార్లమెంట్ ఎన్నికలలో ఓట్ల కోసం కొన్ని రాజకీయ పార్టీలు ఈ దుర్మార్గానికి ఒడికట్టాయని. ఉత్తర ప్రదేశ్‌లో ముస్లిం జనాభా సమాజ్ వాది పార్టీని, ములాయం సింగ్ యాదవ్‌ను అభిమానిస్తుంది. ఆయనకే ఓట్లు వేస్తున్నది. అందువల్లనే శాసనసభ ఎన్నికలలో మాయావతిని ఓడించి, అఖిలేష్ యాదవ్ ముఖ్యమంత్రి కాగలిగాడు.

ముజఫర్‌నగర్ బిజెపి, బిఎస్పీల ఆధిక్యత వున్న ప్రాంతం. చక్కెర మిల్లులు విస్తారంగా వుండడంతో ఇక్కడ ప్రజలు కూడా బాగా స్థితిమంతులు. ఈ ప్రాంతంలో రేపటి ఎన్నికలలో ఓట్ల పంట పండించుకోవడానికి, అఖిలేష్ యాదవ్ ప్రభుత్వాన్ని భ్రష్టు పట్టించడానికి, వారి సమాజ్‌వాదీ పార్టీ నుంచి ముస్లిం ఓటర్లను దూరం చేయడానికి ఒక పథకం ప్రకారమే ఈ మత కలహాలను రెచ్చగొట్టారని అందరూ బాహాటంగానే చెప్తున్నారు. కానీ అందుకు బాధ్యులైన రాజకీయ పార్టీలు ఏవి, ఆ దుర్మార్గ రాజకీయం చేసిన నాయకులెవరు అన్నది మాత్రం ఎవరూ బయటకు చెప్పడం లేదు.

ఏది ఏమైనా ఓట్ల కోసం మనుషులను తెగనరికే స్థాయికి మన రాజకీయాలు పతనమైపోవడం దురదృష్టకరం. అందుకు మత కలహాలను మార్గంగా ఎంచుకోవడం మరింత ఘోరమైన నేరం. ఇటువంటి వికృత పోకడలను కఠినంగా అణిచి వేయకుంటే దేశ సమగ్రత, సమైక్యతలకే భంగం కలుగుతుంది. సామాజిక వాతావరణం నాశనమైపోతుంది.

ఈ కలహాలను కట్టడి చేయడంలో అఖిలేష్ యాదవ్ విఫలమైనాడు. అనుకోకుండా జరగరానిది జరగడంతో ఆ దిగ్భ్రాంతి నుంచి కోలుకోలేక పోతున్నది ఆయన సర్కారు. దాన్ని అలుసుగా తీసుకొని మత విద్వేషకారులు రెచ్చిపోతున్నారు. ఇటువంటి దుస్సంఘటనల కోసం ఎదురు చూసే దేశద్రోహులు, సామాజిక చీడ పురుగులకు మన దేశంలో కొదవ లేదు. వారి కసాయి తనానికి అమాయక ప్రజలు బలైపోకుండా ఉత్తరప్రదేశ్ ప్రభుత్వానికి సంపూర్ణ సహకారం అందజేసి, మంచిపని చేసింది కేంద్ర ప్రభుత్వం. దానితో పాటుగా ఈ ఘోరానికి కారకులైన వారిని గుర్తించి, దేశద్రోహ నేరం క్రింద శిక్షించే బాధ్యతను కూడా కేంద్రమే చేపట్టడం అవసరం. కొందరు రాజకీయవాదులు ఫేస్‌బుక్ వంటి ఇంటర్నెట్ ఆధారిత వేదికలలో అసత్య ప్రచారాలు, విషపు వార్తలు ప్రచారం చేయడం వల్లనే పరిసర జిల్లాలకు మత విద్వేష మంటలు అంటుకొన్నాయని కేంద్ర కమ్యూనికేషన్ల మంత్రి కపిల్ సిబాల్ ప్రకటించాడు. అటువంటప్పుడు అందుకు కారకులైన వారిని వెతికి పట్టుకొనే బాధ్యత కూడా కేంద్రానిదే కదా?

జమీన్‌రైతు

# జనవాణి

## వెంకయ్యను హనుమంతుడు మోయడమేమిటి?

శ్రీ రామచంద్రుడు భారతీయుల ఆరాధ్యదైవం. ఆయనకు నమ్మినబంటు హనుమంతుడు. శ్రీరామనవమి ఉత్సవాల్లో మాత్రం హనుమంతుడి సేవ వుంటుంది. అది సమంజసం కూడా. కాని ఇటీవల గొలగమూడి వెంకయ్యస్వామి ఆరాధనోత్సవాలలో వెంకయ్యను హనుమంతునిపై కూర్చోబెట్టి ఊరేగించారు. వెంకయ్యస్వామి ఎప్పటివాడు? హనుమంతుడు ఎప్పటివాడు?? వెంకయ్యస్వామి ఆశ్రమ నిర్వాహకులుగా తలపండిన వాళ్లుండి కూడా ఈ తగని పని చేయడమేమిటి?

కె.శకుంతలారెడ్డి — నెల్లూరు

## కలెక్టర్‌కు అభినందనలు

జిల్లా కలెక్టర్ శ్రీకాంత్ ఇటీవల నారాయణ మెడికల్ కాలేజికి వెళ్లారు. నారాయణ హాస్పిటల్‌లో జరిగిన ఓ కార్యక్రమంలో పాల్గొన్న ఆయన హాస్పిటల్‌కు జనం వెళ్లను పడుతున్న పాట్లను గమనించానని త్వరలో టౌన్ బస్సులు వేయిస్తానని చెప్పినట్లు పత్రికల్లో చదివాను. ఒక మంచి పని చేయిస్తానని కలెక్టర్ చెప్పినందుకు ఆయనకు నా అభినందనలు తెలియజేస్తున్నాను. నగరంలోని మూలపేట, ఫత్తేఖాన్‌పేట, రైల్వేస్టేషన్, బాలాజీనగర్, ఎన్టీఆర్‌నగర్ ప్రాంతాలకు కూడా కలెక్టర్ గారు చొరవ తీసుకొని టౌన్ బస్సులు నడప మనవి.

చక్కిరాల శ్రీనివాసులు — నెల్లూరు

## నిర్మాణ వ్యయం పార్టీల నేతలు భరించాలి!

రాష్ట్ర విభజన వల్ల సీమాంధ్రులకు, తెలంగాణ వారికీ నష్టమే. కలసి వుంటేనే కలదు సుఖం. నూతన రాష్ట్ర రాజధాని నిర్మాణానికి కొందరు కొన్ని లక్షల కోట్లు ఇవ్వమంటున్నారు. వీటిలో వేల కోట్ల రూపాయలిచ్చినా ఆ మొత్తానికి రెండింతలు జనం నెత్తిన వేస్తాయి కొత్త ప్రభుత్వాలు. ప్రజాస్వామ్యం, అధికారం అనుభవించిన రూపంలో రాజకీయ పార్టీలు, వాటి నేతలు, కొందరు ప్రముఖులు లక్షల కోట్ల రూపాయలు సంపాదించి ఉన్నారు. ఆ సంపద ప్రజలదే. కాబట్టి వారి సంపదలో సగం మొత్తమైనా ఇవ్వాలి. వేర్పాటువాదం, సమైక్యం కొన్ని పార్టీలు, నేతలు ఆడుతున్న డ్రామానని ఇప్పటికైనా ప్రజలు గ్రహించాలనుకొంటాను.

నలబోలు రామ్మోహన్‌రెడ్డి — చెన్నై

## ఇదెక్కడి న్యాయం?

ఘనత వహించిన ఎల్‌ఐసి వారు జూలై 2006లో అందుబాటులోనికి తెచ్చిన మార్కెట్ ప్లస్ పథకం అద్దెదు వద్దు ఆదాయానికి పోతే తూముడు వద్దు దూడ తినేసిందనే సామెతను అక్షరాల నిజం చేసింది. 2008లో మార్కెట్ ప్లస్ పాలసీని తీసుకొంటే మూడు సంవత్సరాలకు రెండింతలు అవుతుందనే మాట

కొరవ 14వ పేజీలో

## 70 ఏళ్ల క్రితం ఈవారం

17-9-1943
పేజీలు:4 వెల: 0-1-6అణా

### వెంకటగిరి రాజ్యంలో

వెనుక రూ.700లకు అమ్ముతుండిన భూమి నేడు 7 గొర్రెలకు ధారబోశాడు. "తూమెడు రూపాయలు సంపాయించవచ్చు గాని తూపిలి చెర్వు క్రింద భూమి సంపాయించలేము" అనే సామెత వుండింది పూర్వం. ఇప్పుడు ఆ ఓటి చెరువు క్రింద భూములంటే ఉప్పునీళ్లకు ధారబోసే దినాలొచ్చాయి.ఈ మధ్య మల్లావు శివరామయ్య శెట్టి అనే రైతు తూపిలి చెరువు క్రింద వున్న తమ ఎకరా భూమిని 7 గొర్రె పిల్లలకు ధారబోశాడు. ఒక సాహెబ్‌కు రామరామా! చివరకెట్టి గతి ప్రాప్తించిందిరా దేముడా!

– ఒకరైతు

### వాకాటి పారుదల

వాకాటి చెర్వు పారుదల చివరన హెచ్చు రేటు ఫక్తు మాగాణి భూములున్నవి మాకు. వాకాటి రైతులు మాత్రం ఆయకట్టులో చేరని తీర్వజాస్తి భూములకు కూడా తుష్టుగా పారించుకొనే దాన్ని, మా భూములకు మాత్రం మాయేటిదారు పుచ్చారు బలరామిరెడ్డి పారనివ్వకుండా గోడు గోడు మనిపిస్తుంటే చెప్పుకున్నా గ్రామపెద్దలు వినిపించుకోకుండా ఉదాసీనంగా ఉండిపొయ్యేదిన్నీ జరుగుతున్నది. మా బాధలు ఏ విధంగా తీరాలెరా దేముడా!

–నెల్లిపూడి రైతు

### బాలిరెడ్డిపాళెం

దరిద్ర దేవత అహర్నిశం అంటే – రాత్రి పగలు స్థిరనివాసం ఏర్పరచుకొని కదలకుండా పీటాసం యేసి కూర్చొన్న ఈ తూపిలి పరగణాలో కంచెల శిస్తులకే కళ్ల నీరు కారుతుంటే మామూళ్లెక్కడ నుండి తెమ్మంటారయ్య.

–రెంటర్

## 50 ఏళ్ల క్రితం ఈవారం

13-9-1963
పేజీలు: 12 వెల: 0-20 న.పై

### గోపాలరెడ్డి ఆనందం

సంస్థ సేవకై కేంద్ర మంత్రిత్వాన్ని పరిత్యజించిన డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డి గారు ఒక లేఖలో తన రాజీనామా గూర్చి, తన భవిష్యత్ కార్యక్రమాన్ని గూర్చి ఈ విధంగా వెలిబుచ్చారు.

"ఈ విధమైన అధికార పరిత్యాగం కాంగ్రెస్‌కు సాంప్రదాయమైనది. 1926లో మద్రాసులో కాంగ్రెస్ మంచి మెజార్టీతో ఎన్నికైనా అది అధికారాన్ని స్వీకరించ లేదు; 1939లో యుద్ధం సంభవించి నపుడు కాంగ్రెస్ మంత్రులందరూ మూకుమ్మడిగా రాజీనామా లిచ్చారు; 1940, 1942లో కాంగ్రెస్ మంత్రులుగా మా వంటి కొందరము జైళ్లకు పోయాము. అధికార పదవులకు దూరమై, ప్రజలకు సన్నిహితం గావడం మాకు మంచి అనుభవాన్ని కల్గిస్తుంది. అధికారంలో లేనపుడు ప్రజలకు సన్నిహితమవుతాము. ఈ సదవకాశానికి హృదయ పూర్వకంగా స్వాగతమిస్తున్నాను. అందులో అధికార పదవులను పరిత్యజించి సంస్థ సేవకు అవసరమైన వారిని నిర్ణయించవలసిందిగా ఏఐసిసి నేత, కాంగ్రెస్ కార్యవర్గం చేత గూడా ముక్త కంఠంతో కోరబడిన మా నాయకుని (నెహ్రూ) ఆదేశంతో అధికారాన్ని పరిత్యజించడం నాకు మరీ ఆనందదాయకంగా వున్నది. ఇది మా సదవకాశంగా, గౌరవంగా నేను భావిస్తున్నాను. కొందరు మంత్రుల, ముఖ్యమంత్రుల రాజీనామాలు ఉద్దేశించిన ఫలితాలు నివ్వగలవని ఆశిస్తున్నాను".

తన రాజీనామా ఆమోదానికి అదృశ్య హస్తాలు పని చేశాయనే వదంతులను తానే మాత్రం నమ్మడం లేదని గోపాలరెడ్డి గారు స్పష్టం చేశారు. తన భవిష్యత్తు కార్యక్రమాలను గురించి గోపాలరెడ్డి గారు ఇలా వ్రాశారు. రాష్ట్రకాంగ్రెస్ అధ్యక్షుడు బ్రహ్మయ్య, సంజీవరెడ్డి గారికి వ్రాశాను. సంస్థకు సంబంధించి నా భవిష్యత్తు కార్యక్రమాన్ని వారితో సంప్రదించిన పిమ్మటే నిర్ణయించుకొంటాను.

# నెల్లూరు ముచ్చట్లు
## విశేషాలు

### షర్మిల సమైక్య శంఖారావం!

వైఎస్ జగన్మోహన్‌రెడ్డి సోదరి షర్మిల సమైక్యా శంఖారావం పేరిట 8వ తేది జిల్లాలో జరిపిన బస్సు యాత్ర విజయవంతమయ్యింది. కడప జిల్లా నుంచి మర్రిపాడు మీదుగా ఆత్మకూరు చేరుకున్న ఆమె ఆర్టీసి బస్టాండ్ సెంటర్ నుంచి సోమశిల రోడ్డు వరకు ప్రదర్శనగా వెళ్లారు. ఇక్కడ ప్రసంగించిన అనంతరం కోలగట్ల, సంగం మీదుగా బుచ్చిరెడ్డిపాళెం చేరుకున్న ఆమె వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహం ఏర్పాటుచేసి ఉన్న కూడలిలో బస్సుపై నుంచే ప్రసంగించారు. అక్కడ నుంచి కోవూరు మీదుగా కావలి వెళ్లిన షర్మిల ఉదయగిరి రోడ్డు సెంటర్‌లో జనానికి సమైక్య రాగాన్ని వినిపించారు. ఆత్మకూరులో మేకపాటి సోదరులు, బుచ్చిలో నల్లపరెడ్డి ప్రసన్న కుమార్‌రెడ్డి, కావలిలో రామిరెడ్డి ప్రతాప్ కుమార్‌రెడ్డి షర్మిల సభలు జయప్రదమయ్యేందుకు బాగా కష్టపడ్డారు.

### ఆకట్టుకొన్న విమర్శ!

రాష్ట్ర విభజనకు కాంగ్రెస్ వర్కింగ్ కమిటీ కేరళకు చెందిన ఆంటోని, తమిళనాడుకు చెందిన చిదంబరం, కర్ణాటకకు చెందిన వీరప్పమొయిలీ, గుజరాత్‌కు చెందిన అహ్మద్‌పటేల్, మధ్యప్రదేశ్‌కు చెందిన దిగ్విజయ్ సింగ్‌ను నియమించడమేమిటని సమైక్య శంఖారావం సభల్లో షర్మిల సంధించిన ప్రశ్నకు జనం నుంచి మంచి స్పందన వచ్చింది. ఈ కమిటీలో ఆంధ్రప్రదేశ్‌కు చెందిన ఒక్కరినీ నియమించకపోవడం దారుణమని షర్మిల చెప్పిన తీరు అందరినీ ఆలోచింప జేసింది.

### అలిగిన ఎజెసి పెంచలరెడ్డి

అందరితో కలుపుగోలుగా వుంటూ తనదైనశైలిలో పనులు నిర్వహించే ఎజెసి పెంచలరెడ్డి అలకపూనడం చర్చనీయాంశమయ్యింది. నెల్లూరు జడ్పీ మీటింగ్ హాలులో జరిగిన సమైక్యాంధ్ర సమావేశంలో ఆయన మాట్లాడుతుండగా ఒక ఉపాధ్యాయుడు అడ్డుతగులుతూ టీచర్లంటే లెక్కచేయడం లేదని, ఏ కార్యక్రమం జరిగినా టీచర్లకు ప్రాధాన్యమివ్వడం లేదంటూ వ్యాఖ్యానించారు. దీంతో కొంత ఆగ్రహానికి, ఆవేదనకు లోనైన పెంచలరెడ్డి విసవిసా వేదిక దిగి సభికుల మధ్య కూర్చొని ఇకపై తాను నాయకత్వం వహించనని, ఉద్యమంలో వెనుక వుంటాననడంతో సమావేశంలో కలకలం రేగింది. చివరకు డిఆర్‌ఓ, ఇతర ఎన్జీఓలు, ఉపాధ్యాయ సంఘ నేతలు సర్దిచెప్పడంతో ఆయన తన అలక వీడారు.

### రంగు పంచల్లో వివేకా

నెల్లూరు రూరల్ శాసనసభ్యుడు ఆనం వివేకానందరెడ్డి ఎప్పుడు ఏ అవతారం ఎత్తుతాడో, ఏ వేషం వేస్తాడో ఎవరికీ తెలియదు. చిత్రవిచిత్ర వేషధారణల్లో తిరిగే ఆయన వినాయక చవితి పండుగ సందర్భంగా రంగు రంగు పంచలు కట్టుకొని పూజలు నిర్వహించడం కన్పించింది. నీలం, మారేడు, ఆకుపచ్చ రంగు పట్టు పంచలు ధరించి ఆయన వివిధ కార్యక్రమాల్లో పాల్గొంటుండడం చూసిన జనం రంగుల పంచల గురించి చర్చించుకొంటున్నారు.

### ఐక్య ఉద్యమం!

సమైక్యాంధ్రకు మద్దతుగా ఐక్యంగా ఉద్యమిద్దామని నెల్లూరు రూరల్ ఎమ్మెల్యే ఆనం వివేకానందరెడ్డి పిలుపిచ్చారు. విఆర్ కాలేజీలో సమైక్యాంధ్ర రాజకీయ జెఏసి సమావేశాన్ని 7వ తేది ఏర్పాటు చేశారాయన. ఎవరికి వారు ఈ సమస్యపై ఉద్యమించడంకన్నా సమిష్టిగా ఉద్యమిస్తే బాగుంటుందన్నారు. అసెంబ్లీలో ప్రత్యేక తెలంగాణ బిల్లు ప్రవేశపెట్టే రోజు జిల్లాను స్తంభింపజేయాలన్నారు. ఆ రోజు జిల్లా వాసులంతా సెల్‌ఫోన్‌లు, ల్యాండ్ ఫోన్లు ఎత్తకుండా నిరసన వ్యక్తం చేయడంతోపాటు కేంద్ర ప్రభుత్వ సర్వీసుల స్తంభనకు ఈ నెల 15వ తేది నుంచి ఉద్యమించాలని కోరారు. జెఏసి నేతృత్వంలో వైష్ణవాలయాల్లో సుదర్శన యాగాలు, శివాలయాల్లో రుద్రయాగాలు, అమ్మవారి ఆలయాల్లో చండీయాగాలు నిర్వహించాలని తీర్మానించారు. సిటీ ఎమ్మెల్యే శ్రీధర్‌కృష్ణారెడ్డి, పోలంరెడ్డి శ్రీనివాసులురెడ్డి, సివి శేషారెడ్డి, చాట్ల నరసింహారావు, లోక్‌సత్తా, సమాజ్‌వాదీ పార్టీల నాయకులు వివిధ వ్యాపార సంస్థల ప్రతినిధులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. తన నేతృత్వంలో జిల్లాలో సమైక్యాంధ్ర ఉద్యమం నడపాలన్న కోరిక వివేకానందరెడ్డికి చాలా రోజులుగా ఉంది. దీనికోసం జెఏసి పేరిట ఈ కార్యక్రమానికి శ్రీకారం చుట్టారు. తన కారుకు కాంగ్రెస్ పార్టీ జెండా తీసివేసి సమైక్యాంధ్ర జెండా కట్టానని ఈ సమావేశంలో వివేకానందరెడ్డి స్పష్టం చేయడం విశేషం.

### తిప్ప దొంగలతో చేతులు కలిపారా?

కప్పరాళ్ల తిప్పకు చెందిన దొంగలతో నెల్లూరు జెండావీధి, పడుగుపాడు, వెంకటేశ్వరపురం, బిట్రగుంటకు చెందిన కొందరు మైనార్టీ యువకులు చేతులు కలిపి దొంగతనాలకు పాల్పడుతున్నట్లు విశ్వసనీయ సమాచారం. వీరిలో ఎక్కువ మంది యువకులు నెల్లూరులోని బంగారంగళ్లలో పనిచేస్తున్నారట. పడుగుపాడులో ఈ మధ్య ఇద్దరు దొంగలను రెడ్‌హ్యాండెడ్‌గా గ్రామస్తులు పట్టుకొన్నారు. వీరిద్దరు వెంకటేశ్వరపురానికి చెందిన మైనార్టీ యువకులుగా గుర్తించారు. ఈ కొత్త దొంగల ముఠాపై క్రైం పోలీసులు దృష్టి సారించాల్సి ఉంది.

### పోలీసు రక్షణలో తుఫాన్ ప్రదర్శన!

రామ్‌చరణ్ తేజ నటించిన తుఫాన్ చిత్రాన్ని పోలీసు బందోబస్తు నడుమ ప్రదర్శించడం చర్చనీయాంశమయ్యింది. 6వ తేది విడుదలైన ఈ చిత్రం మొదటి రోజు ప్రదర్శనలన్నీ పోలీసుల సాయంతో ప్రదర్శించినా రెండవ రోజు నుంచి ఆ సినిమా బాగాలేదన్న టాక్ రావడంతో పోలీసుల బందోబస్తు అవసరం లేకుండా పోయింది. తొలిరోజు విద్యార్థి సంఘాలు ఈ సినిమా ప్రదర్శనను అడ్డుకోవాలని చేసిన ప్రయత్నాన్ని పోలీసులు నిలువరించారు.

### ఆర్టీసి బస్సుల స్థానంలో టౌన్ బస్సులు!

నెల్లూరు నుంచి నడిచే ఆర్టీసి బస్సులన్నీ సమైక్యాంధ్ర ఉద్యమానికి మద్దతుగా నిలిచిపోవడంతో పనుల మీద ఒక ఊరి నుంచి మరో ఊరికి వెళ్లాను జనం ఇబ్బంది పడాల్సి వస్తుంది. జనం నుంచి వ్యతిరేకత రాకుండా ఉండే ఉద్దేశ్యంతో నెల్లూరులో నడిచే టౌన్‌బస్సులు జిల్లాలోని కొన్ని ప్రాంతాలకు నడిచేలా అధికారులు అనధికారికంగా అంగీకరించారు. ఈ బస్సులలో కావలి నుంచి నెల్లూరుకు నడుస్తున్న బస్సుల ఛార్జీ వంద రూపాయలుగా ఉండగా ఉదయగిరికి నుంచి నెల్లూరుకు ఏకంగా 200 రూపాయలు తీసుకొంటున్నారు. రైలు మార్గంలేని ప్రాంతీయులకు టౌన్ బస్సులు, ఆటోలు ఎక్కడం మినహా మరో ప్రత్యామ్నాయం లేకపోవడంతో వీరు టిక్కెట్ల రేట్లు విపరీతంగా పెంచేశారు. సామాన్య, మధ్యతరగతీయులను ఈ ఛార్జీ రేట్లు బెంబేలెత్తిస్తున్నాయి.



సమైక్యాంధ్రకు మద్దతుగా నార్తు ఆములూరు నుంచి అల్లూరు వరకు సాగిన స్కూటర్ ర్యాలీలో పాల్గొన్న కావలి ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు. ప్రక్కన బీద గిరిధర్ తదితరులు.

### ఆత్మకూరు ఆర్డీఓ!

ఆత్మకూరు ఆర్డీఓగా దేశిరెడ్డి కోదండరామిరెడ్డి నియమితులయ్యారు. గతంలో ఈయన చిత్తూరు జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థలో ల్యాండ్ ఎపిఓగా పనిచేశారు. పులివెందుల, ప్రొద్దుటూరు, అనంతపురం, గుంతకల్లు, ధర్మవరం, పుట్టపర్తిలలో తహశీల్దార్‌గా పనిచేసిన అనుభవం కూడా ఈయనకు ఉంది.

### నెల్లూరు బస్సులపై దాడి!

హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియంలో 'సేవ్ ఆంధ్రప్రదేశ్' పేరిట ప్రభుత్వ ఉద్యోగులు పెట్టిన సభకు వెళ్లి తిరిగి వస్తున్న నెల్లూరు బస్సులపై బర్కత్‌పూర్ సెంటర్‌లో దాడి జరిగింది. మొత్తంమీద ఎనిమిది బస్సుల మీద జరిగిన ఈ దాడిలో బస్సు డ్రైవర్లు, క్లీనర్లు ఒకరిద్దరు ఉద్యోగులు గాయపడ్డారు.

### చిత్తూరుకు నీళ్ల తరలింపును నిరసించిన సిపిఎం!

చిత్తూరు తాగునీటి కోసం సోమశిల ప్రాజెక్ట్ నుంచి పది టిఎంసిల నీటి తరలింపుకు రాష్ట్ర ప్రభుత్వం జిఓ జారీ చేయడాన్ని సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్ విమర్శించారు. 7వ తేది సిపిఎం పార్టీ కార్యాలయంలో విలేకరుల సమావేశం ఏర్పాటుచేసి మాట్లాడారు. ప్రజలంతా సమైక్యాంధ్ర నిరసన ఉద్యమంలో ఉండగా ఈ దొంగచాటు పనిచేయడం

కొరవ 14వ పేజీలో

### పదవ వర్ధంతి



శ్రీమతి ఖాసిం బీబీ
W/o లేట్ మహబూబ్ సాహెబ్
అల్లూరు.
మరణం :14.9.2003

అమ్మా నీవు మాకు దూరమై
అప్పుడే పదేళ్లయ్యాయి
ఎన్నేళ్లు గడిచినా
ఎద పొరలలో నీ జ్ఞాపకాలు
నా హృదిలో గిలిపెడుతున్నాయి
నీ ప్రేమ, ఆప్యాయతలు
ఈ జన్మలో మరవలేనమ్మా

... అల్లూరు రహీం (కుమారుడు)
గౌసున్నీసా బేగం (కోడలు)
ఆషిక్ (మనుమడు)

## డాబాల్లో ఆగని మద్యం విక్రయాలు!

**● పోలీసు కన్నెర్ర చేస్తేనే ఫలితం**

అటు పోలీస్ అధికారులు, ఇటు ఎక్సైజ్ అధికారులు ఎన్ని హెచ్చరికలు జారీచేస్తున్నా డాబాల్లో మద్యం విక్రయాలు ఆగడం లేదు. జాతీయ రహదారిపైనా, ఇతర రహదారులపైనా రాకపోకలు సాగించే ప్రయాణీకులకు ఆహారం విషయంలో ఇబ్బందులు కలుగకుండా వుండేందుకు, వ్యాపారం కోసం డాబాలనేవి ఏర్పాటయ్యాయి. ముఖ్యంగా ఈ డాబాల సంస్కృతి పంజాబ్ ప్రాంతానికి చెందిన వారి నుంచి దిగుమతి అయ్యిందనే చెప్పాలి. అధిక లోడ్‌తో సుదూర ప్రాంతాలకు వెళ్లే లారీ డ్రైవర్లు, సిబ్బందికి పంజాబీ రుచులను రోటీ, తదితర ఆహారాన్ని అందించేందుకు జాతీయ రహదారిపై డాబాలను ఏర్పాటు చేసుకొన్నారు కొందరు ఉత్తర భారతీయులు. ప్రారంభంలో బాగానే వున్న వీటిని చూసి ఇబ్బడిముబ్బడిగా డాబాలు ఏర్పాటయ్యాయి. ఈ నిర్వాహకులు అందరూ జిల్లాకు చెందినవారే అధికంగా వున్నారు. డాబాల పేరుతో నిబంధనలకు విరుద్ధంగా మద్యం అమ్మకాలు సాగించడంతోపాటు డాబాల్లోనే మద్యం సేవించే ఏర్పాట్లు చేయడంతో డాబాలు కాస్తా బార్లుగా మారిపోయాయి. వీటికి వచ్చే వారి సంఖ్య రోజురోజుకు అధికం కావడంతో డాబాల్లో ప్రత్యేకంగా గదులు ఏర్పాటుచేసి ఏసి సౌకర్యాన్ని కల్పిస్తున్నారు కొందరు నిర్వాహకులు. దీని వలన త్రాగుబోతుల ఆగడాలు ఎలా వున్నా రోడ్డు ప్రమాదాలు అధికమయ్యాయి. తాగి వాహనాలను మితిమీరిన వేగంతో నడుపుతుండడంతో వాటిని నడిపేవారు ప్రమాదాల బారిన పడడంతోపాటు ఎదురు వచ్చే వాహనాల ప్రమాదానికీ కారణమవుతున్నారు. ఎప్పుడో ఎక్సైజ్ అధికారులు తీరిక చేసుకుని ఒకటి రెండు డాబాలపై దాడులు చేయడం తప్ప వీటి నిర్వాహకులు ఇచ్చే మామూళ్ల కారణంగా చూసీచూడన్నట్లు వ్యవహరిస్తుండడంతో డాబాల్లో మద్యం విక్రయాలు, మద్యసేవనం జరుగుతూనే వుంది. ఇటీవల జాతీయ రహదారుల్లోని డాబాల పరిస్థితిని గమనించిన ఎస్పీ రామకృష్ణ వీటిని అరికట్టాలని సిబ్బందికి ఆదేశించారు. ఫలితం ఎలా వుంటుందో చూడాలి.

## నెల్లూరులో సినిమా టిక్కెట్ల మాఫియా!

**● మొదటి రెండు రోజులు దొరకని టిక్కెట్లు**

సినిమా అనేది సగటు ప్రేక్షకుడికి వినోదం కల్గించే అంశం. చిన్న సినిమా అయినా, పెద్ద సినిమా అయినా, డబ్బింగ్ సినిమా అయినా, స్ట్రెయిట్ సినిమా అయినా సినిమాను సినిమాగానే చూస్తారు ప్రేక్షకులు. నచ్చితే ఆదరిస్తారు, లేదంటే ఎంత భారీ బడ్జెట్‌తో తీసిన సినిమా అయినా చూడరు. ప్రేక్షకులకు ఆనందాన్ని కల్గించే సినిమా టిక్కెట్లు నేడు సాధారణ ప్రేక్షకులకు ప్రారంభం రోజున అందకుండా పోతున్నాయి. ప్రముఖ హీరోలు నటించే సినిమాలకు ఈ సమస్య ఎదురౌతుంది. హీరోల ఫ్యాన్స్ పేరుతో, అభిమాన సంఘాల పేరుతో అనుబంధంగా ఏర్పాటు చేసుకొన్న స్వచ్ఛంద సంస్థల పేరుతో నిర్వాహకులు, దానికి అదనంగా రాజకీయ సంపర్కం కల్గిన వాళ్లు సినిమా టిక్కెట్లను తమ చెప్పుచేతల్లో పెట్టుకొని సంఘాల నిర్వహణ, ఇతరత్రా సాకులు చూపుతూ ఇష్టానుసారంగా టిక్కెట్ రేట్లు పెంచి అమ్మకాలు సాగిస్తూ జేబులు నింపుకొంటుండడం నగరంలో అధికమయ్యింది. సామాన్య ప్రేక్షకుడు సినిమా విడుదలైన మొదటి రెండు రోజులు సినిమాకు వెళ్లి టిక్కెట్ తెచ్చుకొనే పరిస్థితి కనిపించడం లేదు. ఫలానా ఎమ్మెల్యే చెప్పాడనో, అభిమాన సంఘ నేత అధికంగా టిక్కెట్లు తీసుకుపోయాడనో చెబుతూ మొక్కుబడిగా కొన్ని టిక్కెట్లు ఇచ్చి తమకేమీ సంబంధం లేనట్లు సినిమా హాళ్ల నిర్వాహకులు వ్యవహరిస్తుండడంతో సగటు ప్రేక్షకులు దగా పడుతున్నారు. పెద్ద హీరోలు నటించిన చిత్రాలను అడ్వాన్స్ బుకింగ్ పేరిట కొన్ని టిక్కెట్లు మాత్రమే ఇచ్చి మిగతా టిక్కెట్లను సినిమా హాళ్లలో పనిచేసి సిబ్బంది కొందరు బ్లాక్ అమ్మే దందా కూడా నెల్లూరులో యదేచ్ఛగా కొనసాగుతుంది. కాస్త బాగుందన్న టాక్ వచ్చిన సినిమాల టిక్కెట్లు వారం రోజులగ్గానీ సామాన్య ప్రేక్షకులకు దొరకడం లేదు. దీంతో ఎలాగైనా తమ అభిమాన నటుడి సినిమా చూడాలన్న మోజుతో 200, 300 రూపాయలు పెట్టి బ్లాక్‌లో టిక్కెట్ కొనుగోలుచేసి వెళుతున్నారు. ఈ వ్యవహారం ఒక మాఫియాను తలపిస్తోంది. సినిమా హాళ్ల నిర్వాహకులు బలమున్న వ్యక్తులు కావడం వలన సినిమా హాళ్లలో ప్రాథమిక సౌకర్యాలు లేకపోయినా బ్లాక్ టిక్కెట్ల దందా కొనసాగుతున్నా పట్టించుకొనే అధికారులే లేకుండా పోయారు. దీంతో సినిమా హాళ్ల నిర్వాహకులు ఆడిందే ఆటగా పాడిందే పాటగా నెల్లూరులో చిత్రాల ప్రదర్శన తయారయ్యింది.

**● మాశిలామణిపై**

## చర్యలకు ప్రభుత్వం గ్రీన్‌సిగ్నల్!

జిల్లా వైద్య ఆరోగ్య శాఖలో పదవీ విరమణ చేసిన అధికారితోపాటు మరికొందరిపై క్రిమినల్ చర్యలు తీసుకొనేందుకు ఎసిబికి ప్రభుత్వం గ్రీన్ సిగ్నల్ ఇచ్చినట్లు తెలిసింది. ఆరు నెలల క్రితం అవినీతి నిరోధక శాఖ అధికారులు ఈ శాఖ కార్యాలయంపై ఆకస్మిక దాడులు జరిపి కొన్ని కీలక ఫైళ్ల స్వాధీనం చేసుకున్న విషయం తెలిసిందే. మాశిలామణి హయాంలో జరిగిన అన్ని పదోన్నతులు, డిప్యుటేషన్లు, మందుల కొనుగోళ్లు, తదితర అంశాలపై ఎసిబి దృష్టి సారించి తనిఖీలు చేపట్టింది. జిల్లా కార్యాలయంలోని సిబ్బంది ఎసిబి కోరిన సమాచారాన్ని అందించేందుకు సహకరించలేదు. దీంతో క్షేత్ర స్థాయిలో తనిఖీలకు శ్రీకారం చుట్టారు. ఎసిబి అధికారులు జరిపిన తనిఖీల్లో ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో చోటుచేసుకున్న పలు అక్రమాలు కూడా బయటపడ్డాయి. కొన్ని ప్రాథమిక ఆరోగ్య కేంద్రాల్లో పౌష్టికాహారం పంపిణీ పేరుతో నిధుల్ని డ్రా చేసుకుని స్వాహా చేయడాన్ని గుర్తించారు. వైద్య ఆరోగ్య శాఖలో జరిగిన అక్రమాలు, అవకతవకలపై నివేదిక తయారు చేసి ప్రభుత్వానికి పంపారు. దాదాపు ఆరు నెలల వ్యవధిలో ప్రభుత్వం స్పందించి అక్రమాలకు పాల్పడిన అధికారులు, సిబ్బందిపై క్రిమినల్ చర్యలు తీసుకునేందుకు అంగీకరించినట్లు తెలిసింది. ఇందుకు సంబంధించి ఎసిబి కార్యాలయానికి ఉత్తర్వులు రావాలి.

## వాహనదారులను అదుపు చేయడంలో విఫలం!

**ఇష్టమొచ్చినట్లు నెంబర్ ప్లేట్లు**

వాహనాల నెంబర్ ప్లేట్ల వినియోగంలో కొందరు యువకుల ఆలోచనలు వెర్రితలలు వేస్తుండడంతో ప్రభుత్వ నియమనిబంధనలు అమలు కావడం లేదు. ద్విచక్ర వాహనాలు, కార్లకు తగిలించే నెంబర్ ప్లేట్లను తమ ఇష్టానుసారంగా మలచుకొంటూ చూసే వారికి అది ఏ నెంబర్, దాని అసలు నెంబర్ ఏమిటో తెలియకుండా గందరగోళపరిచేలా వుంటున్నాయి. నాలుగు అంకెల నెంబర్‌లో ముందు సంఖ్య కన్పడకుండా చేసి ఆ తర్వాత మూడంకెలను ఫ్యాన్సీ నెంబర్లుగా చూపేందుకు ఆరాటపడుతుండడంతో రవాణాశాఖ ఆ వాహనానికి ఏ నెంబర్ కేటాయించిందో అర్థం కానంతగా గజిబిజిగా వుంటున్నాయి వాహనాల నెంబర్ ప్లేట్లు. ఉదాహరణకు ఒక కారుకు 4007 అనే నెంబర్ వుందనుకుంటే ముందుండే నాలుగును చిన్నదిగానో, పైనో వేసి మిగతా 007 అనే నెంబర్‌ను పెద్దదిగా వేసుకొంటూ ఫ్యాన్సీ నెంబర్‌లా ఫీలయ్యే వాహన యజమానుల సంఖ్య అధికమవుతోంది. ఇది వారికి మోజనిపించినా, తప్పేమీలేదనిపించినా ఇది ముమ్మాటికీ తప్పే. ప్రభుత్వ నిబంధనలను అతిక్రమించడం అటుంచితే ఏదైనా ప్రమాదం జరిగినపుడు, అనుకోని ఘటన జరిగినపుడు ఆ వాహనం యొక్క నెంబర్‌ను సులభంగా గుర్తించలేని పరిస్థితి ఏర్పడుతుంది. అలాగే వాహనాలపై భయంకరంగా, వికృతంగా కనిపించే పుర్రెబొమ్మల్లాంటివి వేసుకొంటుండడం ఆయా వ్యక్తుల మానసిక స్థితికి అద్దం పడుతున్నాయి. వీటితోపాటు పోలీస్, ప్రెస్ అనే బోర్డు పెట్టుకొని నెంబర్ ప్లేట్లు లేకుండా తిరిగే వాహనాలు అధికం. జిల్లా ఎస్పీ రామకృష్ణ తన శాఖ సిబ్బంది ఇలాంటి పోలీస్ స్టిక్కర్లు వేసుకోవడం చూసి వారికి అపరాధ రుసుం విధించిన సంగతి తెలిసిందే.



చిత్రవిచిత్రంగా నెంబర్ ప్లేట్.

ఇదే మాదిరిగా కార్లు, బైక్‌లకు సంబంధించి గందరగోళంగా, రవాణా శాఖ నిబంధనలు పాటించకుండా తగిలించుకొనే నెంబర్ ప్లేట్లపైనా ట్రాఫిక్ పోలీసులు, రవాణా శాఖ దృష్టి సారించాల్సి వుందని పలువురు కోరుకొంటున్నారు.

## సమ్మెలోనూ అధికార దుర్వినియోగం

**ప్రభుత్వ వాహనాలు వాడుతున్న ఉన్నతాధికారులు**

రాష్ట్ర విభజన ప్రకటన ఉపసంహరించుకుని రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలని డిమాండ్ చేస్తూ జిల్లా ఉన్నతాధికారులు సమ్మె చేస్తున్నారు. ఒక ప్రక్క సమ్మెలో వుంటూనే, మరో ప్రక్క అధికారం వినియోగించుకొంటున్నారు. సమ్మెలో వున్న గెజిటెడ్ అధికారులంతా ప్రభుత్వం కేటాయించిన వాహనాలను వాడుతున్నారు. వాస్తవంగా విధులకు గైర్హాజరవుతూ సమ్మెలో వున్నవారు ప్రభుత్వ వాహనాలను ఏ కార్యక్రమానికీ వాడకూడదు. అలాగే ప్రభుత్వ కార్యాలయాల్లో సమ్మెకు సంబంధించి ఎటువంటి విషయాలు చర్చించరాదు. బయట సమావేశాలు, సభలు నిర్వహించుకోవచ్చు. అదనపు జెసి, డిఆర్వో, జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారితోపాటు ఇతర శాఖలకు చెందిన అధికారులు వాహనాలను వాడుతూ సమైక్యాంధ్ర ఆందోళన కార్యక్రమాల్లో పాల్గొంటుండడం చర్చనీయాంశంగా మారింది. అంతే కాకుండా అటెండర్లను సైతం సొంత పనులకు కేటాయిస్తున్నారు. ఇదిలా వుండగా ప్రజలకు, ప్రభుత్వానికి అనుసంధానంగా విధులు నిర్వహించే జిల్లా పౌరసంబంధాల శాఖ అధికారి, ఇతర సిబ్బంది సమ్మెలో వున్నామని చెబుతూనే సమైక్యాంధ్ర కార్యక్రమాల గురించి పత్రికలకు సమాచారమందిస్తున్నారు. డిపిఆర్వో కార్యాలయ సిబ్బంది వాస్తవంగా సమ్మెలో వుంటే అందరితోపాటు ఆందోళన, ధర్నా కార్యక్రమాల్లో పాల్గొనాలి. అలా కాకుండా అధికారిక విధుల్లో వున్నప్పుడు ఏవిధంగా పత్రికలకు సమాచారం ఇస్తారో అదేవిధంగా సమ్మెలో వుంటూ అధికార దుర్వినియోగానికి పాల్పడుతుండడం విశేషం. వచ్చే నెలలో డిపిఆర్వో పదవీ విరమణ చేయనున్నారు. పదవీ విరమణ సందర్భంగా ఎటువంటి ఆందోళన కార్యక్రమాల్లో పాల్గొనకూడదంటున్నారు. ఈ మాట చెబుతూ జిల్లాస్థాయి అధికారులు చేపట్టే కార్యక్రమాల సమాచారం అందిస్తున్నారు.

## నగరంలో పెరిగిన చోరీలు!

నెల్లూరు నగరంలో చోరీలు ఎక్కువైనాయి. పోలీసులు సమైక్యాంధ్ర ఆందోళనలకు బందోబస్తులో వుండడాన్ని ఆసరాగా తీసుకున్న నేరగాళ్లు చోరీలు చేసేందుకు బరి తెగిస్తున్నారు. పగటిపూట రెక్కీ నిర్వహించి రాత్రివేళల్లో చోరీలకు పాల్పడుతున్నారు. నగరంలో ప్రతి రోజూ ఏదో ఒక పోలీస్ స్టేషన్ పరిధిలో ఇళ్లలో దొంగతనాలు, మహిళల మెడలో గొలుసు లాక్కెళ్లడం వంటి నేరాలు జరుగుతున్నాయి. నేరాలు జరిగిన తర్వాత బాధితులు సంబంధిత పోలీస్ స్టేషన్‌కెళ్లి ఫిర్యాదు చేయడం మినహా చోరీకాబడిన సొత్తును తిరిగి పొందలేక పోతున్నారు. విలాసవంతమైన జీవితం గడపాలన్న ఉద్దేశంతో ప్రధానంగా కొందరు యువకులు చోరీలు చేస్తున్నారు. ఒంటరిగా వెళుతున్న మహిళలను లక్ష్యంగా చేసుకుని వారి మెడలోని బంగారు సరుడును లాక్కెళ్లడం, పార్కింగ్ చేసిన ద్విచక్ర వాహనాలను అపహరించి ఇతర ప్రాంతాల్లో విక్రయించడం వంటి నేరాలు చేస్తున్నారు. ఇటువంటి నేరాలు చేసినవారు పోలీసులకు పట్టుబడిన సమయంలో చేసిన నేరాలు వెల్లడవుతున్నాయి. 18 నుంచి 25 సంవత్సరాలలోపు వున్న విద్యార్థులు నేరస్తుల జాబితాలో వుండడాన్ని తెలుసుకున్న వారి తల్లితండ్రులు ఆందోళన చెందక తప్పడం లేదు. నగరంలోని అన్ని పోలీస్ స్టేషన్ల సిబ్బంది, ఎస్‌ఐలు అందుబాటులో ఉండడం లేదు.

# కలువాయిలో వ్యాపారస్తుల దోపిడీ!

## సమైక్య ఉద్యమం పేరుతో అన్ని వస్తువుల ధరలు పెంచేశారు

ఒకవైపు సమైక్యాంధ్ర ఉద్యమం ఉధృతంగా సాగుతుంటే మరోవైపు దీన్ని అవకాశంగా చేసుకొని వ్యాపారులు దోచుకొంటున్నారు. కలువాయి మండలంలో గమనిస్తే ఈ దోపిడీ ఏ మేర సాగుతుందో అర్థమౌతుంది. మండలంలో సమైక్యాంధ్ర ఉద్యమం జోరుగా సాగుతుంది. దీంతో రవాణాపై తీవ్ర ప్రభావం పడుతోంది. దీనిని అవకాశంగా చేసుకొని కొందరు వ్యక్తులు అన్ని వస్తువుల ధరలు అమాంతం పెంచేశారు. చిల్లర సరుకులు దగ్గర్నుంచి, కూరగాయలు, పండ్ల ధరలు ఇష్టానుసారంగా పెంచి అమ్మకాలు సాగిస్తున్నారు. ఆర్టీసి కార్మికులు ఉద్యమంలో పాల్గొంటుండడం, బస్సులు నడవక పోవడంతో రాకపోకలకు తీవ్ర ఆటంకాలు ఎదురౌతున్నాయి. ఒకటి అరా బస్సులు మాత్రం అవి ఎప్పుడు వస్తాయో, ఎప్పుడు పోతాయో తెలియనంతగా తిరుగుతుండడంతో ప్రయాణీకులు ఆటోలపై ఆధారపడాల్సి వస్తోంది. దీంతో ఆటో వాళ్లు ఛార్జీలను మూడింతలు పెంచేసి ప్రయాణీకులను నిలువు దోపిడీ చేస్తున్నారు. సోమశిల – కలువాయి, ఆదూరుపల్లి – పొదలకూరు, నెల్లూరు మార్గంలో ఆటోలు అధికంగా తిరుగుతున్నాయి. విధిలేని పరిస్థితుల్లో ఆటోవాళ్లు అడిగినంతా ముట్టచెప్పి ప్రయాణం చేయాల్సి వస్తోందని ప్రయాణీకులు వాపోతున్నారు. ఇక ఆటోల్లో 25 నుంచి 30 మందిని ఒక్కో ఆటోలో ఎక్కించి తిప్పుతుండడంతో ప్రజలు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని రాకపోకలు సాగిస్తున్న ప్రమాదకర పరిస్థితులు ఏర్పడుతున్నాయి. కలువాయి, చేజర్ల, పొదలకూరు పోలీసులు ఈ ఆటోలపై దృష్టి సారించి ఆటోల్లో అధిక సంఖ్యలో ప్రయాణీకులను ఎక్కించకుండా చూడాలని, ఛార్జీలను నియంత్రించాలని ఈ ప్రాంత ప్రజలు కోరుకొంటున్నారు.

● మూగజీవాలను బలిగొంటున్న

# విద్యుత్ కర్మాగారాల్లోని నీరు!

**తమ్మినపట్నంలో 17 గోమాతల మరణం**

తీర ప్రాంతాల్లో విచ్చలవిడిగా ఏర్పాటవుతున్న విద్యుత్ కర్మాగారాల వల్ల పర్యావరణం దెబ్బతినడంతో పాటు మూగజీవాలు బలైపోతుండడం పలువురిని కలచివేస్తోంది. విద్యుత్ కర్మాగారాల నుంచి విడుదలయ్యే వ్యర్థాలు కాలువల్లో కలిసి, ఆ నీటిని తాగిన పశువులు మృతి చెందుతున్న ఘటన చిల్లకూరు మండలం తమ్మినపట్నంలో జరిగింది. ఇక్కడ ఏర్పాటుచేసిన విద్యుత్ ఉత్పత్తి కేంద్రంలో వినియోగించిన నీటిని తిరిగి కండలేరుకు, అక్కడ నుంచి కాలువలకు వదులుతున్నారు. దీనివల్ల కండలేరు కాలువలోని మత్స్య సంపద ఇప్పటికే తుడిచిపెట్టుకపోయింది. ఇప్పుడు ఆ ప్రభావం స్థానికంగా తిరుగుతూ దాహార్తి తీర్చుకొనేందుకు కాలువలోకి వచ్చే మూగజీవాలపై పడుతోంది. ఇటీవల రెండు రోజుల వ్యవధిలో 17 ఆవులు చనిపోయాయి. తమ కళ్ల ముందే ఆవులు వరుసబెట్టి మృత్యువాత పడుతుండడంతో వాటి యజమానులు, గ్రామస్తులు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. విద్యుత్ పరిశ్రమల కారణంగా మూగజీవాలు బలైపోతున్నాయని ఆగ్రహించిన గ్రామస్తులు ఆ కర్మాగారాల ముందు ఆందోళనకు దిగారు. సిబ్బందిని అడ్డుకొని, పరిశ్రమలకు వ్యతిరేకంగా నినాదాలు చేశారు. దీంతో పరిశ్రమల ప్రతినిధులు అక్కడకు చేరుకొని గ్రామస్తులతో చర్చించి నష్టపరిహారం చెల్లిస్తామని హామీ ఇవ్వడంతోపాటు, మృతి చెందిన ఆవులకు పశువైద్యాధికారులతో పరీక్షలు జరిపి కారణాలు తెలుసుకొని తదుపరి చర్యలు తీసుకొంటామనడంతో గ్రామస్తులు ఆందోళన విరమించారు.

# తీరుమారని గూడూరు నేతలు!

● **సమైక్యాంధ్ర ఉద్యమంలోనూ లడాయికే పెద్దపీట**

గూడూరు నియోజకవర్గంలో ఒకవైపు సమైక్యాంధ్ర ఉద్యమం రోజురోజుకు ఉధృతం అవుతుంటే మరోవైపు అదేస్థాయిలో వివిధ పార్టీల మధ్య ఆరోపణలు, ప్రత్యారోపణలు, విమర్శలు, ప్రతివిమర్శలతో రాజకీయ రంగు పులుముకొంటోంది. రాష్ట్ర విభజనకు మీ పార్టీ కారణం అంటే, కాదు మీ పార్టీ వలనే విభజన జరిగిందంటూ తెలుగుదేశం పార్టీ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ, కాంగ్రెస్‌పార్టీ ఒకరిపై ఒకరు దుమ్మెత్తి పోసుకొంటుండడంతో సమైక్యాంధ్ర ఉద్యమంలో రాజకీయ విమర్శలు చోటు చేసుకొంటున్నాయి. ఇటీవల గూడూరు నుంచి రైతులు, రైతు డిపో నిర్వాహకులు, వ్యవసాయ కార్మికులు, వ్యవసాయశాఖ సంయుక్తంగా సమైక్యాంధ్రకు మద్దతుగా ట్రాక్టర్లతో చిల్లకూరు జాతీయ రహదారి కూడలి వరకు ర్యాలీ నిర్వహించారు. అక్కడ బైఠాయించి ఆందోళనకు సిద్ధమవుతుండగా వేరు వేరుగా అక్కడకు చేరుకొన్న తెలుగుదేశం పార్టీ, వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీ నేతలు విమర్శలకు దిగడంతో సమైక్యాంధ్ర ఉద్యమం ప్రక్కదారి పట్టింది. ఉద్యమానికి మద్దతుగా ఆందోళనకు సిద్ధమై వచ్చిన రైతులు, ఉద్యోగులు, వ్యాపారులు నేతల తీరుకు విస్తుపోయారు.

# తెలుగు ప్రజల్లో చిచ్చుపెట్టింది కాంగ్రెస్‌నే!

● **సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్ విమర్శ**



కాంగ్రెస్ పార్టీ రాష్ట్ర విభజన ప్రకటించి తెలుగు ప్రజల్లో చిచ్చు పెట్టిందని సిపిఎం జిల్లా కార్యదర్శి చంద్ర రాజగోపాల్ విమర్శించారు. తమ స్వార్థం కోసం రాష్ట్రాన్ని చీల్చేందుకు ప్రయత్నిస్తోందన్నారు. తోటపల్లి గూడూరు మండలం నరుకూరులో సమైక్యాంధ్రపై సిపిఎం వైఖరి అన్న అంశంపై జరిగిన సదస్సులో ఆయన ముఖ్యఅతిథిగా పాల్గొని సిపిఎం వైఖరిని తెలియజెప్పారు. ప్రత్యేక రాష్ట్ర వివాదంపై అభిప్రాయ సేకరణకు శ్రీ కృష్ణ కమిటీని నియమించిన కేంద్ర ప్రభుత్వం వారిచ్చిన నివేదికను తుంగలో తొక్కి ఇరు ప్రాంతాల ప్రజల మధ్య చిచ్చు పెట్టిందని దుయ్యబట్టారు. ప్రజాప్రతినిధులు సమైక్యాంధ్రకు మద్దతుగా రాజకీయాలు చేయడంలో డ్రామాలాడుతున్నారని విమర్శించారు. స్పీకర్ ఫార్మెట్‌లో రాజీనామాలు చేస్తే పదవులు పోతాయన్న భయంతో దొంగాట ఆడుతూ ప్రజలను తప్పుదోవ పట్టిస్తున్నారని ఆరోపించారు. రాష్ట్ర విభజన విధానంపై కాంగ్రెస్, బిజెపిల వైఖరి మార్చగలిగేలా ఉద్యమం సాగాలని పిలుపునిచ్చారు. సిపిఎం పార్టీ తొలి నుంచి సమైక్యాంధ్రకు కట్టుబడి వుందంటూ తమ పార్టీ వైఖరిని కుండబద్ధలు కొట్టినట్లు ప్రకటించారు. ఈ సమావేశంలో సిపిఎం సభ్యులు గంగపట్నం రమణయ్య, పొట్టేపాళెం చంద్రమౌళి, రమణమూర్తి, జనవిజ్ఞాన వేదిక నాయకుడు సుబ్బారావు తదితరులు పాల్గొన్నారు.

● హైదరాబాద్‌ను

# అభివృద్ధి చేసింది నేదురుమల్లి, చంద్రబాబు!

**కావలిలో విష్ణువర్ధన్‌రెడ్డి**



హైదరాబాద్‌ను అభివృద్ధి చేయడంలో మాజీ ముఖ్యమంత్రులు నేదురుమల్లి జనార్ధనరెడ్డి, నారా చంద్రబాబు నాయుడుల కృషి ఎంతో వుందని మాజీ ఎమ్మెల్యే, కావలి నియోజకవర్గ కాంగ్రెస్‌పార్టీ ఇన్‌ఛార్జి కాటంరెడ్డి విష్ణువర్ధన్‌రెడ్డి తెలిపారు. సీమాంధ్రులు ఎంతో మంది వివిధ రకాలుగా హైదరాబాద్ అభివృద్ధికి కారకులయ్యారన్నారు. అలాంటి హైదరాబాద్‌ను తెలంగాణకు ఇవ్వడాన్ని ఏ ఒక్కరూ ఒప్పుకోరన్నారు. రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలని డిమాండ్ చేశారు. కావలి పట్టణంలో సమైక్యాంధ్ర జెఎసి ఆధ్వర్యంలో చేపట్టిన దీక్షలకు మద్దతు తెలిపి విష్ణువర్ధన్‌రెడ్డి పై విధంగా వ్యాఖ్యానించారు. కావలి పట్టణంతోపాటు బోగోలు, జలదంకి, కలిగిరిలలో సమైక్యాంధ్రకు మద్దతుగా వివిధ రూపాల్లో ఆందోళన కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. వైఎస్ఆర్ కాంగ్రెస్ పార్టీకి సంబంధించి నాగులవరం సర్పంచ్ గణేశం రమేష్‌రెడ్డి, మునగాల గోపాలరెడ్డి తదితరులు దీక్షలు చేపట్టారు. జలదంకిలో వైకాపా మండల కన్వీనర్ మాలకొండారెడ్డి, ఇస్కా మదన్‌మోహన్‌రెడ్డి, సురా శేషారెడ్డి, ప్రసాద్‌నాయుడు, శ్రీధర్‌రెడ్డి, హజరత్, గోవర్ధన్‌రెడ్డి రిలే నిరాహార దీక్షలు చేపట్టారు. కలిగిరిలో రాజన్న దళంగా ఏర్పడ్డ మెట్టుకూరు చిరంజీవిరెడ్డి ఆధ్వర్యంలో బైక్ ర్యాలీ నిర్వహించారు. దీంతో వూరూరా సమైక్య నినాదం దద్దరిల్లుతోంది.

# జ్వాలాముఖి ఆలయ ఛైర్మన్‌గా సోమన!

● **ఆదాలకు నమ్మిన బంటు**

తోటపల్లి గూడూరు మండలం వరిగొండ గ్రామ దేవత శ్రీ జ్వాలాముఖి ఆలయ నూతన ఛైర్మన్‌గా సోమన శ్రీనివాసులురెడ్డి బాధ్యతలు చేపట్టారు. జ్వాలాముఖమ్మకు భక్తుల కోర్కెలు తీర్చే కల్పతల్లిగా పేరుంది. అలాంటి ఆలయానికి ఛైర్మన్‌గా సోమన శ్రీనివాసులురెడ్డిని నియమించాడు శాసనసభ్యుడు ఆదాల ప్రభాకర్‌రెడ్డి. సోమన ఆదాలకు నమ్మినబంటు. రామభక్త హనుమాన్ లాగా ఆదాల ఎక్కడుంటే అక్కడ వుంటాడు. అందరితో కలుపుగోలుగా వుండడం, అనవసర వివాదాల్లో తలదూర్చక మంచి వ్యక్తిగా పేరు తెచ్చుకోవడంతో ఆయన్ను ఈ పదవికి ఎంపిక చేశారు. ఇటీవల ఆలయంలో జరిగిన కార్యక్రమంలో నూతన ఛైర్మన్‌గా శ్రీనివాసులురెడ్డి బాధ్యతలు చేపట్టారు. ఈ ఆలయానికి సంబంధించి రహదారి నిర్మాణం చాలా కాలంగా పెండింగ్‌లో వుంది, అలాగే ఆలయ పర్యవేక్షణ చూస్తున్న ఇఓలపైనా ఆరోపణలు వస్తున్నాయి. వీటన్నింటిని చక్కదిద్ది ఆలయాన్ని అభివృద్ధి పరచాలని భక్తులు కోరుకొంటున్నారు.



సోమన శ్రీనివాసులురెడ్డిని అభినందిస్తున్న కొండ్రెడ్డి రంగారెడ్డి.



సమైక్యాంధ్రకు మద్దతుగా వెంకటాచలంలో తెలుగుదేశం పార్టీ నేతృత్వంలో జరిగిన దీక్షా శిబిరంలో మాట్లాడుతున్న ఆ పార్టీ జిల్లా అధ్యక్షుడు బీద రవిచంద్ర. వేదికపై ఎమ్మెల్యేలు బీద మస్తాన్‌రావు, పరసా రత్నం, కురుగొండ్ల రామకృష్ణ. పొలిట్ బ్యూరో సభ్యుడు సోమిరెడ్డి చంద్రమోహన్‌రెడ్డి.

● కావలిలో

# పేదల స్థలాలు ఆక్రమించిన రియల్టర్లు!

అక్రమాలు జరిగినప్పుడు విచారణ జరిపిస్తామని ఉన్నతాధికారులు చెప్పినా ఇంతవరకు విచారణ జరపకపోవడం, అక్రమార్కులపై ఎలాంటి చర్యలు లేకపోవడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి కావలి నియోజకవర్గంలో. పట్టణ పరిధిలో పేదలకు కేటాయించిన నివేశన స్థలాలను రియల్టర్లు ఆక్రమించి ఏకంగా వ్యాపారం చేశారు. పెద్ద ఎత్తున పంపిణీ చేసిన ఈ స్థలాలను తమ వ్యాపారాభివృద్ధి కోసం ఉపయోగించుకొని పేదలకు అన్యాయం చేశారు. ఇందులో అన్ని పార్టీల చోటా నేతల పాత్ర వుంది. కొందరు అధికారులతో కుమ్మక్కై ఈ అక్రమాలకు పాల్పడ్డారు. దీనిపై అప్పటి కలెక్టర్ శ్రీధర్ విచారణ బృందాన్ని నియమించి విచారణ జరిపించినా ఇంతవరకు నివేదిక బయటపెట్టలేదు, బాధ్యులపై చర్యలు లేవు. సర్వాయపాళెంలో 600 ఎకరాల అసైన్‌మెంట్ భూములు భూస్వాముల చేతుల్లోకి వెళ్లాయి. రెవిన్యూ సదస్సులో సెర్ప్ సిఇఓ రాజశేఖర్ స్వయంగా ప్రజల నుంచి ఫిర్యాదులు అందుకొన్నారు. వీటిని పేదలకు అప్పగించేందుకు రెండు నెలల వ్యవధి తీసుకొన్న అధికారులు ఆ తర్వాత పట్టించుకోక పోవడంతో విషయం మరుగున పడిపోయింది. అలాగే మద్దూరుపాడు ధాన్యం కొనుగోలు కేంద్రంలో 12లక్షల రూపాయలు ప్రక్కదారి పట్టాయి. విచారణ మీద విచారణలు చేసి నిజమని నిగ్గుతేల్చిన అధికారులు ఆ సొమ్మును అక్రమార్కుల నుంచి రాబట్టడం గాని, వారిపై కఠిన చర్యలు తీసుకొన్న దాఖలాలు గాని లేవు. ఇందిరమ్మ గృహా

## అయినా చర్యలు లేవు

లలోనూ అక్రమాలు జరిగాయనే దానిపై పెద్దఎత్తున ఆరోపణలు వచ్చాయి. ఎమ్మెల్యే బీద మస్తాన్‌రావు స్వయంగా రంగంలోకి దిగి బినామీ పేర్లతో వున్న ఇళ్లను కూలగొట్టించారు. అయినా బాధ్యులపై ఎలాంటి చర్యలు లేవు. బహిరంగంగా అక్రమాలు, అవకతవకలు జరిగినట్లు బట్టబయలైనా సంబంధిత వ్యక్తులపై చర్యలు తీసుకోకపోవడం విమర్శలపాలవుతోంది.

● బుచ్చి

# ఎస్ఐ బాగా పనిచేస్తున్నాడు!

## ప్రజల అభిమానం సంపాదించాడు

మద్యస్థాలకు, అవినీతికి పేరుపడ్డ బుచ్చి పోలీస్‌స్టేషన్‌కు కొత్తగా వచ్చిన ఎస్ఐ కొంతమేర గాడిలో పెట్టే ప్రయత్నం చేస్తున్నాడు. అల్లరిమూకల ఆగడాలు, తాగుబోతుల వీరంగం, అస్తవ్యస్థంగా వున్న ట్రాఫిక్‌తో బుచ్చి మండల కేంద్రంలో పరిస్థితి అధ్వాన్నంగా వుంది. ఎస్ఐలు రావడం, బదలీపై వెళ్లడం తప్ప పెద్దగా పట్టించుకొన్నవాళ్లు, కరకుగా డ్యూటీ చేసినవాళ్లు లేరు. అలాంటిది సూళ్లూరుపేట నుంచి కొత్తగా బదలీపై వచ్చిన ఎస్ఐ కె.శ్రీనివాసరావు విధి నిర్వహణలో ప్రజల మన్ననలు అందుకొంటున్నాడు. గతంలో హరికృష్ణ, వెంకట్రావు తదితరులు ఎస్ఐలుగా పని చేసి వెళ్లారు. వారి తర్వాత ఎస్ఐ లేక హెడ్‌కానిస్టేబుల్ మల్లిఖార్జునరెడ్డి పెత్తనంతో లంచాల కేంద్రంగా మారింది పోలీస్‌స్టేషన్. శ్రీనివాసరావు ఎస్ఐగా వచ్చీరావడంతోటే పరిస్థితులు గమనించి కరకుగా డ్యూటీ చేస్తున్నాడు. ఖాకీ యూనిఫాం పవర్ చూపిస్తూ తాగుబోతులు, అల్లరిచిల్లరగా తిరుగుతూ గొడవలు, కొట్లాటలకు వెళ్లేవారికి, సింగిల్ నెంబర్ల నిర్వాహకులను అణచి వేశాడు. రాత్రి 10 గంటలయితే షాపులు తీసివున్నా, త్రాగుబోతులు కన్పించినా, రౌడీలు, ఈవ్‌టీజర్లు కన్పిస్తే ఉతికి ఆరేస్తుండడంతో పోలీసులంటేనే హడలిపోతున్నారు. దీంతో రాఘవరెడ్డినగర్, శాంతినగర్, బైపాసు రోడ్డు, రామకృష్ణానగర్ లేఅవుట్, జెండా దిబ్బ రోడ్డు తదితర ప్రాంతాల్లో నిత్యం తాగి అల్లరిచేసే మూకలు కన్పించడం లేదు. వీరికి అండగా వుంటూ మద్యస్థాలు చేసే చోటా నేతలు స్టేషన్‌వైపు రావడం మానేశారు. ఎంతోకాలంగా అస్తవ్యస్థంగా వున్న ట్రాఫిక్‌ను గాడిలో పెట్టేందుకు శాయశక్తులా కృషి చేస్తున్నాడు ఎస్ఐ. రెండు నెలల్లో 561 ట్రాఫిక్ కేసులు నమోదుచేసి లక్షా అరవై రూపాయలు ప్రభుత్వానికి జమ చేశాడు. దీంతో ఎస్ఐ శ్రీనివాసరావును ప్రజలు అభినందిస్తున్నారు. ఇలాగే నిఖార్సుగా డ్యూటీ చేసి బుచ్చిలో వేళ్లూనుకొన్న వ్యభిచారాన్ని అరికట్టాలని కోరుకొంటున్నారు.

# సూళ్లూరుపేట ఎమ్మెల్యేను అడ్డుకొన్న సమైక్యాంధ్ర జెఏసి!



సమైక్యాంధ్ర మద్దతుదారులు నాయుడుపేటలో చేపట్టిన ర్యాలీలో పాల్గొనేందుకు వచ్చిన స్థానిక శాసన సభ్యుడు పరసా రత్నంకు చేదు అనుభవం ఎదురైంది. రాజీనామా చేసి ఉద్యమంలో పాలు పంచుకోవాలంటూ ఐక్య కార్యాచరణ సమితి నేతలు ఆయన్ను అడ్డుకొన్నారు. దీంతో సమైక్యాంధ్ర మద్దతుదారులు, ఎమ్మెల్యే అనుచరుల మధ్య తోపులాట జరిగింది. ఉద్యమం జరుగుతున్న ప్రాంతానికి పరసా రత్నం వచ్చారు. ఆయన్ను చూసిన జెఏసి నేతలు నందమూరి

## మాటలతో మాయచేసి తప్పించుకొన్న పరసా

హరికృష్ణ లాగా స్పీకర్‌కు రాజీనామా లేఖ సమర్పించి దాన్ని ఆమోదింపచేసుకొని ఆ తర్వాత ఉద్యమంలోకి రావాలని పట్టుబట్టారు. దీనికి పరసా రత్నం స్పందిస్తూ తెలుగుదేశం పార్టీ ఎమ్మెల్యేలు అందరూ రాజీనామా చేశామని తెలిపారు. సమైక్యాంధ్రకు మద్దతు తెలిపిన తమకు పదవులు ముఖ్యం కాదని, రాష్ట్రం సమైక్యంగా వుండాలన్నదే తమ అభిమతమంటూ తనదైన శైలిలో ఉపన్యసిస్తూ ఆందోళనకారుల ఆగ్రహాన్ని చల్లార్చే యత్నం చేశారు. అనంతరం ఉపాధి కార్మికులు చేపట్టిన రిలే నిరాహార దీక్షా శిబిరాన్ని సందర్శించి వారికి సంఘీభావం తెలిపారు.

# వైద్య సేవలు గగన కుసుమం!

అన్ని సౌకర్యాలు వున్నా వైద్య సేవలకు దూరంగా వుంటోంది వెంకటగిరి మండలంలోని జికె పల్లెలో గల ప్రాథమిక ఆరోగ్య కేంద్రం. ఈ ఆరోగ్య కేంద్రాన్ని చాలా ఏళ్ల క్రితం ఏర్పాటు చేశారు. జిల్లా ప్రజలతోపాటు ప్రక్కనేగల చిత్తూరుజిల్లా వారికి అందుబాటులో వుండేలా ఈ ఆరోగ్య కేంద్రాన్ని ఏర్పాటు చేశారు. వెంకటగిరి, బాలాయపల్లి మండలాల్లోని ప్రజలతో పాటు చిత్తూరుజిల్లాలోని శ్రీకాళహస్తి, తొట్టెంబేడుకు చెందినవారు వివిధ వైద్య సేవల కోసం ఇక్కడకు వస్తుంటారు. అలాంటి ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో రెగ్యులర్ డాక్టర్ లేక, ఇన్‌ఛార్జి వైద్యాధికారి అందుబాటులో వుండక, సిబ్బంది పట్టించుకోకపోవడంతో వైద్య సేవలు అందడం లేదు. వివిధ అనారోగ్య సమస్యలతో ఈ ఆరోగ్య కేంద్రానికి వచ్చే రోగులు డాక్టర్ లేదని ప్రతిసారి చెప్పే సమాధానంతో విసుగు

## జికె పల్లి పిహెచ్‌సి పరిస్థితిది

చెంది ప్రైవేటు ఆస్పత్రులకు వెళ్లి వైద్యం చేయించుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది. పలువురు ఈ ఆస్పత్రి వ్యవహారమై వెంకటగిరి తహశీల్దార్ కృష్ణమూర్తికి ఫిర్యాదు చేయడంతో ఆయన ఆస్పత్రిని తనిఖీ చేయగా డాక్టర్ గైర్హాజరై వుండడం బయటపడింది. 24 గంటలు వైద్యం అందించే ఆస్పత్రి ఇలా వైద్య సేవలకు దూరంగా వుండడంపై విమర్శలు వ్యక్తం అవుతున్నాయి. జిల్లా ఉన్నతాధికారులు స్పందించి ఈ ప్రాథమిక ఆరోగ్య కేంద్రంలో వైద్య సేవలు అందేలా చూడాలని పలువురు కోరుకొంటున్నారు.

● భారీ వాహనాలను

# అడ్డుకొన్న దగదర్తివాసులు!

## రోడ్డు దెబ్బతినిపోయింది

అధిక లోడ్‌తో భారీ వాహనాలు తిరగడం వల్ల రోడ్లు ధ్వంసమై పోతున్నాయంటూ దగదర్తి మండల ప్రజలు వాహనాలను చెన్నూరులో అడ్డుకొన్నారు. మండలంలో ఇటీవల గత కొంతకాలంగా 50 టన్నులకు మించిన లోడ్‌తో మితిమీరిన వేగంతో వాహనాలు ఇష్ట ప్రకారం రాకపోకలు సాగిస్తుండడం వల్ల మండలంలోని రోడ్లన్నీ దెబ్బతినిపోతున్నాయని ఆగ్రహం వ్యక్తం చేశారు. టిప్పర్‌ల యజమానులకు గతంలో ఎన్నోసార్లు అధిక లోడ్‌తో వాహనాలను తిప్పొద్దని చెప్పినా విన్పించుకోనందునే వాహనాల రాకపోకలను అడ్డుకొన్నట్లు మాలెపాటి రవీంద్ర నాయుడు తెలిపారు. అసలే అంతంత మాత్రంగా వున్న రోడ్లు పూర్తిగా ధ్వంసమైపోయాయన్నారు. అధికారులకు తెలిపినా స్పందన లేకపోవడంతో తామే వాహనాలను అడ్డుకోవాల్సి వస్తోందన్నారు. మండలంలోని పలు గ్రామాల్లో అధిక లోడ్‌తో వాహనాలు తిరగడం వల్ల దెబ్బతిన్న రోడ్లకు ఆ వాహనాల యజమానులే మరమ్మత్తులు జరిపించాలని అంతవరకు లారీలను, టిప్పర్లను తిరగనివ్వమని మండల ప్రజలు తెగేసి చెప్పారు. ఈ ఆందోళన కార్యక్రమంలో మల్లిఖార్జునరెడ్డి, వెంకయ్య తదితరులు పాల్గొన్నారు.

# ఇందిరమ్మ ఇళ్లు పిచ్చుక గూళ్లు!

### • మౌలిక వసతుల కల్పన ఎప్పుడు?

వెంకటగిరిలో నిర్మిస్తున్న ఇందిరమ్మ ఇళ్లలో మౌలిక వసతులు కరువై లబ్దిదారులు తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఇప్పటి వరకు మూడు విడతలుగా ఇందిరమ్మ ఇళ్ల నిర్మాణం జరిగినా ఏ ఒక్క దానిలోనూ లబ్దిదారులకు పూర్తిస్థాయిలో కనీస సౌకర్యాలు ఏర్పడిన దాఖలాలు లేవు. మొదటి విడత కట్టిన ఇళ్లకు వసతులు కల్పించామని అధికారులు చెప్పినా, రెండో విడతలో అదే మాట చెప్పినా కరెంటు, రోడ్లు, డ్రైనేజి, మంచి నీటి వసతికి నోచుకోక ఈ కాలనీలోని ప్రజలు ఇప్పటికీ అవస్థలు పడాల్సి వస్తోంది. మార్కెట్ గోడౌన్ ప్రక్కన తిరుపతి వెళ్లే మార్గంలో వుంది ఈ కాలనీ. మూడో విడత క్రింద నాయుడుపేట రోడ్డు ప్రక్కన మంజూరయ్యాయి. మౌలిక వసతులకు నోచుకోకపోవడంతో లబ్దిదారులు ఇందిరమ్మ ఇళ్లు కట్టుకొని అక్కడ నివసించే వీలు లేకుండా పోతోంది. రెండు బోర్లు ఈ ప్రాంతంలో వేసినా ఫలితం లేకుండా పోయింది. ఇప్పటికైనా అధికారులు ఇందిరమ్మ ఇళ్ల కాలనీల్లో నివసించేందుకు కనీస సౌకర్యాలు, కనీస వసతులు కల్పించేందుకు తగిన చర్యలు చేపట్టాలని లబ్దిదారులు కోరుతున్నారు.




సమైక్యాంధ్రకు మద్దతుగా కావలిలో వివిధ ఆర్య వైశ్య సంఘాల నేతృత్వంలో జరిగిన ర్యాలీలో జాయింట్ యాక్షన్ కమిటీ కన్వీనర్ తిరువీధి ప్రసాద్‌తో ఆందోళనకారులు.

## బోగోలు పంచాయతీలో సమస్యల తిష్ట!

### • పరిష్కార మార్గం చూడాలి

బోగోలు పంచాయతీలో సమస్యలు తిష్ట వేసుకొని వున్నాయి. పంచాయతీ సర్పంచ్‌గా వచ్చిన వారికి ఈ సమస్యలు స్వాగతం చెప్తున్నాయి. చెత్త పేరుకపోయి, కాలువలు పూడిపోయి మురుగు రోడ్లపైకి పొంగి పొర్లుతుండడం, దోమలు, పందుల సంచారంతో మురికి కూపంగా మారింది పంచాయతీ. రోడ్లు సరిగా శుభ్రపరచక పోవడంతో చెత్తాచెదారాలతో అసహ్యకరమైన పరిస్థితి ఏర్పడింది. దుర్గంధం వస్తుండడంతో ప్రజలు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. పంచాయతీ పరిధిలో అధికభాగం సన్నజనమే నివసిస్తున్నారు. కూలీనాలీ చేసుకొని కుటుంబాలను పోషించుకొనేవారే అధికం. 4, 5, 6, 7 వార్డుల్లో కాలువలు సరిగాలేక మురుగు నీరు మడుగులు కట్టి వుంటోంది. చెంచులక్ష్మీపురంలో గిరిజనులు అధికంగా నివసిస్తుంటారు. ఇక్కడా పారిశుధ్య పరిస్థితి పూర్తిగా క్షీణించింది. అక్కరాజువారి కండ్రిగ పరిస్థితి మరింత దారుణం. గతంలో సర్పంచ్‌లుగా వున్నవారు, అధికారులు ఈ సమస్యలను పట్టించుకోకపోవడంతో ఇవి అలాగే పంచాయతీని పట్టి పీడిస్తున్నాయి. కొత్తగా పంచాయతీ సర్పంచ్‌గా గెలిచిన వారైనా ఈ సమస్యలను పరిష్కరించాలని ప్రజలు కోరుకొంటున్నారు.

## ఎస్సీలకు రుణాలివ్వడం లేదు!

### దళిత సంఘర్షణ సమితి జిల్లా అధ్యక్షుని ఆరోపణ

అటు బ్యాంకులు ఎస్సీలకు రుణాలివ్వక, ఇటు ఎస్సీ కార్పొరేషన్ పట్టించుకోకపోవడంతో ఎస్సీల పరిస్థితి రెండింటికీ చెడ్డ రేవడిలా మారిందని దళిత సంఘర్షణ సమితి జిల్లా అధ్యక్షుడు, న్యాయవాది ఎస్.మల్లి ఆవేదన వ్యక్తం చేశారు. దళిత గిరిజనులకు అండగా నిలవాల్సిన కార్పొరేషన్‌లు నిర్వీర్యమైపోయాయన్నారు. వీరికి రుణ సౌకర్యాన్ని కల్పించడంలో కార్పొరేషన్, బ్యాంకులు దారుణంగా విఫలమయ్యాయన్నారు. బ్యాంకులు మొండి చేయి చూపుతుండడం, ఎస్సీ కార్పొరేషన్‌లో కోట్లాది రూపాయల నిధులు మురిగిపోతున్నా ఎస్సీల రుణాల గురించి పట్టించుకోవడం లేదన్నారు. ఫలితంగా దళితులు అభివృద్ధికి నోచుకోలేకపోతున్నారన్నారు. దీనికితోడు సమైక్యాంధ్ర ఉద్యమం ప్రారంభమైనప్పటి నుంచి గ్రామాల్లో దళితులు, గిరిజనులకు ఉపాధి పనుల లేక, కూలీ పని దొరక్క అవస్థలు పడుతున్నారన్నారు. కాంగ్రెస్ ప్రభుత్వ తీరు వల్లనే రాష్ట్రంలో ఈ పరిస్థితులు తలెత్తాయన్నారు. ఇప్పటికైనా పాలకులు, అధికారులు దళితులకు బ్యాంకుల నుంచి రుణాలు అందేలా, ఎస్సీ కార్పొరేషన్ నుంచి లబ్ది చేకూరేలా చూడాలన్నారు.

### గండిపాళెం గురుకులంలో

## గోడ కూలింది!

### అదృష్టవశాత్తు తప్పించుకొన్న పిల్లలు

ఉదయగిరి మండల పరిధిలోని గండిపాళెం గురుకుల పాఠశాలలో పెను ప్రమాదం తప్పింది. పాఠశాల భవనం పిట్టగోడ కూలిపోవడంతో విద్యార్థులు భయాందోళనలు వ్యక్తం చేశారు. ఈ ఘటన జరిగిన సమయంలో విద్యార్థులందరూ స్టడీ అవర్‌లో వుండడంతో ఎవరికి ఎలాంటి ప్రమాదం జరగకపోవడంతో సిబ్బంది వూపిరి పీల్చుకొన్నారు. ఈ పాఠశాల భవనాన్ని 1987లో నిర్మించారు. గత కొంతకాలంగా శిథిలావస్థకు చేరుకొన్న ఈ భవనం బాగోగులు ఎవరూ పట్టించుకోకపోవడంతో విద్యార్థులు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని భయం భయంగా కాలం గడుపుతున్నారు. ఈ పరిస్థితుల్లో పిట్టగోడ కూలిపోవడంతో విద్యార్థులతోపాటు తల్లిదండ్రులు ఆందోళన చెందుతున్నారు. అధికారులు స్పందించి భవనానికి మరమ్మత్తులు చేయించాలని పలువురు కోరుకొంటున్నారు.

# ముక్క పురుగుల దాడి!

### దడచుకొంటున్న కావలి వెంగళరావునగర్ వాసులు

కావలి పట్టణం వెంగళరావు నగర్ ప్రాంతాల్లోని వారు ముక్క పురుగుల ధాటికి బెంబేలెత్తిపోతున్నారు. సాయంత్రం అయితే పురుగులు నివాసాల్లోకి వచ్చేస్తుండడంతో తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు స్థానికులు. ఈ ప్రాంతంలో ఎఫ్‌సిఐ గోడౌన్లు వున్నాయి. ఈ చుట్టుప్రక్కల 600 కుటుంబాలు కాపురం వుంటున్నాయి. ఈ గోడౌన్‌లో 14వేల టన్నులకుపైగా బియ్యం నిల్వలు వున్నాయి. ప్రతి నెలా నిబంధనల ప్రకారం బియ్యాన్ని తరలించాల్సి వుండగా స్వల్పంగా పంపుతుండడంతో టన్నులకొద్దీ బియ్యం నిల్వలు పేరుకపోయాయి. దీనికి మరో కారణం వుంది. మిగతా ప్రాంతాల్లోని గోడౌన్ల కంటే వెంగళరావునగర్‌లో గల గోడౌన్లలో అద్దె తక్కువ. దీంతో ఎక్కువ కాలం ఇక్కడే బియ్యాన్ని నిల్వ వుంచుతున్నారు. ఈ కారణంగా ముక్క పురుగులు పట్టి అవి చుట్టుప్రక్కల నివాసాలలోకి వచ్చేస్తుండడంతో ఆ ప్రాంతీయులు తీవ్ర అసౌకర్యానికి గురౌతున్నారు. సాయంత్రమైతే లెక్కకు మించి పురుగులు వచ్చి చేరుతుండడం, ఆహార పదార్థాలపైకి రావడంతో స్థానికులు ఆందోళన చెందుతున్నారు. చర్మంపై దద్దుర్లు వస్తున్నాయి. అధికారులు, గోడౌన్ నిర్వహణపై శ్రద్ధ పెట్టకపోవడం, మద్దూరుపాడులోని వ్యవసాయ మార్కెట్ గోడౌన్లలోని స్టాకును తరలిస్తుండడంతో వెంగళరావునగర్ గోడౌన్లలో గల బియ్యం పురుగులు పట్టి పోతున్నాయి. ప్రజలు పడే బాధలను గమనించైనా అధికారులు బియ్యం పురుగుపట్టిపోకుండా చూడాలని, ఎక్కువకాలం నిల్వ చేయకుండా తగిన శ్రద్ధ వహించాలని స్థానికులు కోరుకొంటున్నారు.

**జమీన్‌రైతు**
పొగతోట, నెల్లూరు - 524 001
ఫోన్: 0861 - 2327354
సెల్: 98489 66190
జీవిత చందా రూ.1000లు
సంవత్సర చందా
స్వదేశంలో రూ.200లు
విదేశాలకు రూ.1000లు

# ప్రప్రథమ మానవావతారం వామనావతారం!



శ్రీ మహావిష్ణువు ఎత్తిన అవతారాలలో విశిష్టమైనది వామనావతారం. ఇది ప్రప్రథమ మానవావతారం. బ్రాహ్మణ బాలుని రూపంలో అవతరించి బలి చక్రవర్తిని అధఃపాతాళానికి అణచివేసిన అవతారం ఇది. వామనుడు భాద్రపద శుక్ల ద్వాదశినాడు జన్మించినందున ఆ రోజును వామన జయంతిగా జరుపుకొంటారు. విష్ణుమూర్తి లీలా విశేషాలు అనంతం. అనితర సాధ్యం. ఏ పని చేసినా లోకకళ్యాణం కోసమే, ఏ అవతారం ఎత్తినా లోక సంరక్షణకే. వేదాలను కాపాడేందుకు మత్స్యావతారం ఎత్తినా, మందర పర్వతం సముద్రంలో పడిపోకుండా రక్షించేందుకు కూర్మావతారాన్ని, భూదేవిని కాపాడేందుకు వరాహ అవతారాన్ని ధరించాడు శ్రీహరి. భక్తుడైన ప్రహ్లాదుడిని కాపాడేందుకు నరసింహావతారం ఎత్తాడు. ఏ అవతారాన్ని ధరించినా, అందులోని పరమార్థం భిన్నమైంది, విశిష్టమైనది. ఎలాంటి యుద్ధాలు చేయకుండా, అవతలవారి బలహీనతలను గుర్తించి కాగల కార్యం జరిపించడం శ్రీమన్నారాయణుడి ప్రత్యేకత.




వామనావతారం ఎత్తడంలో రెండు కారణాలున్నాయి. తనను పుత్రునిగా కోరుతున్న కశ్యపుని దంపతుల కోరిక తీర్చడంతోపాటు, దేవేంద్రుడికి తిరిగి అధికారాన్ని, రాజ్యాన్ని కట్టబెట్టేందుకు వామన రూపం ధరించాడు విష్ణుమూర్తి. ప్రహ్లాదుని మునిమనుమడైన బలి చక్రవర్తి ఆడిన మాట తప్పనివాడిగా, దానగుణ సంపన్నునిగా పేరు గాంచాడు. ఈయన శ్రీహరి పరమభక్తుడు. దేవతలపై దండెత్తిన బలి ఓటమి పాలవుతాడు. రాక్షస గురువు శుక్రాచార్యుని సహకారంతో తిరిగి దేవతలపై యుద్ధానికి వెళ్లి ఇంద్రాది దేవతల నుంచి రాజ్యాన్ని చేజిక్కించుకుంటాడు. దేవేంద్రుడి తల్లి ఎలాగైనా తన కుమారుడిని తిరిగి రాజ్యాధిపతిని చేయమని విష్ణుమూర్తిని వేడుకొంటుంది. ఆమె కోరిక నెరవేర్చేందుకు అదితి గర్భాన జన్మిస్తాడు శ్రీహరి వామన రూపంలో. పొట్టిగా బాలుడిగా వున్న వామనుడు బలిచక్రవర్తి యాగం చేస్తున్న చోటుకు వెళ్లి మూడడుగుల నేల దానం ఇవ్వమని అడుగుతాడు. విప్రుడి రూపంలో వచ్చిన వ్యక్తికి సహాయం చేసేందుకు సిద్ధమవుతాడు బలిచక్రవర్తి. అయితే వచ్చింది సాక్షాత్తు శ్రీమహావిష్ణువు అని గుర్తించిన శుక్రాచార్యుడు బలిని హెచ్చరించినా తను ఇచ్చిన మాట తప్పనంటాడు. బలిచక్రవర్తి భార్య వింధ్యావళి జలాన్ని పోస్తుండగా బలి దానమిచ్చేందుకు సంసిద్ధుడవుతాడు. అప్పుడు శుక్రాచార్యుడు కలశంలో నుంచి వచ్చే నీటిధారకు అడ్డపడతాడు. దానిని గమనించిన వామనుడు దర్భతో పొడవగా శుక్రాచార్యుడు ఒక కన్ను కోల్పోతాడు. తన కోరిక మేరకు ఒకడుగు నేలపై, రెండో అడుగు ఆకాశాన్ని తాకిన వామనుడు మూడో అడుగు ఎక్కడ పెట్టమంటావు అని బలిని ప్రశ్నించగా తన శిరస్సుపై పెట్టమనడంతో తన పాదంతో భూమిలోకి అణిచివేస్తాడు. కాని బలి దానగుణాన్ని మన్నించిన శ్రీహరి ఆయన్ను సుతల లోకానికి రాజు చేసి తానే ద్వారపాలకుడిగా మారతాడు. ఇదీ వామనావతార గాథ. J

ఇంజనీరింగ్ కాలేజి

## పలు ప్రత్యేకతల

# విద్యానగర్‌లోని ఎన్‌బికెఆర్ ఇంజనీరింగ్ కాలేజి!



విద్యానగర్ అంటే విద్యకు నిలయం. ఇక్కడ నుండి ఎందరో మేధావులు, శాస్త్రజ్ఞులు, డాక్టర్లు, ఇంజనీర్లు, లాయర్లు, వ్యాపారవేత్తలు, ప్రసిద్ధ కవులు, పోలీసు అధికారులు ఒకరేమిటి అనేక స్థాయిల్లో దేశవిదేశాల్లో పేరొందిన వ్యక్తులను అందించిన ఘనత ఎన్‌బికెఆర్ విద్యాసంస్థలకే దక్కిందని చెప్పవచ్చు. సాధారణంగా ఇంజనీరింగ్ కళాశాలలు ఎక్కువగా పట్టణ ప్రాంతాల్లోనే నెలకొల్పబడి అక్కడి ప్రజానీకానికి అందుబాటులో వుంటాయి. ఇందుకు భిన్నంగా నెల్లూరు జిల్లాలోని పట్టణ ప్రాంతానికి దూరంగా గ్రామీణ వాతావరణంలో అత్యాధునిక వసతులతో స్థాపించబడిన ప్రప్రథమ ఇంజనీరింగ్ కళాశాల ఎన్‌బికెఆర్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ అండ్ టెక్నాలజీ. 76 సంవత్సరాల క్రితం హరిజన విద్యార్థి ఉద్దారక సంఘం స్థాపనతో విద్యాభివృద్ధికి అంకురార్పణ చేసి అవిరళ కృషి సల్పిన పద్మశ్రీ నేదురుమల్లి బాలకృష్ణారెడ్డి స్ఫూర్తిని పుణికిపుచ్చుకుని ఆయన కన్న కలలను ప్రతిఫలింపజేయడంలో రాజ్యసభ సభ్యులు, మాజీ ముఖ్యమంత్రి నేదురుమల్లి జనార్ధన్‌రెడ్డి తర్వాత ఆయన తనయుడు ప్రస్తుత కళాశాల కరస్పాండెంట్ నేదురుమల్లి రామ్‌కుమార్ విశేష కృషి చేస్తున్నారు.

జెఎన్‌టియూ మాజీ వైస్ ఛాన్సలర్ ప్రస్తుత కళాశాల ఛైర్మన్ డాక్టర్ ఐ.గోపాలరెడ్డి, కళాశాల డైరక్టర్ డాక్టర్ విజయకుమార్‌రెడ్డిలు కూడా కళాశాల అభివృద్ధికి ఎనలేని కృషి చేస్తున్నారు. 1979 సంవత్సరంలో నెల్లూరుకు 65 కిలోమీటర్ల దూరంలో విద్యానగర్ – గూడలి గ్రామానికి మధ్య దాదాపు 184 ఎకరాల సువిశాల ప్రాంగణంలో శోభాయమానమైన ప్రకృతి ఆహ్లాదకరమైన వాతావరణంలో ఈ ఇంజనీరింగ్ కళాశాల ఏర్పాటైంది.

> నేదురుమల్లి రామ్‌కుమార్‌రెడ్డి, విద్యావేత్తలు డాక్టర్ ఐ.గోపాలరెడ్డి, డాక్టర్ విజయకుమార్‌రెడ్డిల నేతృత్వంలో విద్యా సుమగంధం వెల్లివిరుస్తున్న సంస్థ.

రాష్ట్రంలోనే ప్రైవేట్ యాజమాన్యం కింద రెండవ కళాశాలగా వెలిసింది. ఈ కళాశాల కోసం 13,500 చదరపు అడుగుల విస్తీర్ణంగల భవనాలు, సుసంపన్నమైన యంత్ర సామాగ్రితో సకల ఆధునిక వసతి సదుపాయాలు సంతరించుకొంది. లైబ్రరీకి 75 లక్షల రూపాయలు వెచ్చించి దేశీయ, విదేశీయ జర్నల్స్ సమకూర్చబడ్డాయి. ఈ కళాశాల విద్యార్థులను క్రీడారంగంలో ప్రోత్సహించేందుకు ప్రత్యేకంగా 14 ఎకరాల స్థలాన్ని ఇండోర్, అవుట్ డోర్ గేమ్స్ కొరకు కేటాయించారు. కళాశాల ప్రాంగణంలో ప్రత్యేకించి బాలురకు వేరుగా హాస్టల్ వసతి ఏర్పాటు చేయబడింది. ఈ విద్యా సంవత్సరం నుండి కళాశాల యాజమాన్యంచే నూతనంగా నిర్మించబడిన హాస్టల్ మొదటి సంవత్సరం ప్రవేశం పొందే విద్యార్థులకు కేటాయించారు. అలాగే కళాశాల ప్రాంగణంలోనే బాలికలకు అన్ని వసతులతో కూడిన సురక్షితమైన హాస్టల్ వసతి కల్పించారు. కళాశాల అధ్యాపకులకు కూడా ప్రాంగణంలోనే నివాసాలు కల్పించనున్నది విద్యాసంస్థ.

600 కెవి సామర్థ్యం గల పవర్ జనరేటర్స్ ద్వారా నిరంతర విద్యుత్ సరఫరా, ప్రాంగణంలో వైఫై అంతర్జాల సదుపాయాలు వున్నాయి. ప్రస్తుత విద్యా సంవత్సరం (2013 – 14) నుండి కళాశాల అనంతపురంలోని జెఎన్‌టియూ అనుబంధంగానూ, స్వయం ప్రతిపత్తి కలిగి వున్నది. ఈ కళాశాల గత రెండు పర్యాయాలు ఎన్‌బిఎ వారిచే గుర్తింపు పొంది మూడవ పర్యాయం ఎన్‌బిఎ పరిశీలన బృందం సందర్శన పూర్తి చేసుకుంది. అంతే కాకుండా నాక్(యుజిసి)చే ఎ గ్రేడ్‌గా గుర్తింపు పొందిన విద్యాసంస్థ. ఇక్కడ పనిచేస్తున్న అధ్యాపకులు పిహెచ్‌డి, పిజి డిగ్రీ కలిగిన వారే వున్నారు. ప్రతిభ కలిగిన పేద విద్యార్థులకు ఫౌండేషన్ ఫర్ ఎక్స్‌లెన్స్ ద్వారా స్కాలర్‌షిప్పు మంజూరు చేస్తున్నారు. అదే విధంగా ప్రతిభ కలిగిన విద్యార్థులకు ట్యూషన్ ఫీజు చెల్లింపులో రాయితీ కల్పిస్తున్నారు. J

# చంద్రబాబు సాహస యాత్ర!

## ● ధైర్యంగా జనం ముందుకు వచ్చినవాడిగా పేరుగాంచాడు.



చంద్రబాబు రాజనీతి చతురరుడంలో ఎవరికీ ఎటువంటి సందేహాలూ లేవు. మంచి వ్యూహకర్త కూడా. అందువల్లనే ఎన్నో గడ్డు పరిస్థితులు తట్టుకొని ఇంత కాలం తెలుగుదేశం పార్టీని నిలబెట్టగలుగుతున్నాడు. రెండు సార్లు ఓటమి ఎదురైనా కార్యకర్తలను నిలుపుకోగలుగుతున్నాడు. అయితే ఆయన ఇప్పుడు ఆంధ్ర ప్రాంతంలో జరుపుతున్న ఆత్మగౌరవ యాత్ర మాత్రం చాలా విచిత్రమైనదిగా కన్పడుతున్నది. విశేషంగా పరిగణించవలసి వస్తున్నది.

తెలుగుదేశం పార్టీ అధికారికంగా తెలంగాణ అనుకూల లేఖ ఇచ్చింది. రాష్ట్ర విభజన నిర్ణయం జరిగిన తర్వాత ఆంధ్ర ప్రాంతం ఉద్యోగులు తనను కలిస్తే, నేను వెనక్కు రాలేనని నిక్కచ్చిగా చెప్పాడు. పైగా హైదరాబాద్ పెద్ద విషయం కాదు, నాలుగు లక్షల కోట్లు ఇస్తే, దానికి ధీటైన రాజధానిని నేను ఐదేళ్లలో కట్టగలనని ప్రకటించాడు కూడా. అంటే ఆయన, ఆయన పార్టీ సంపూర్ణంగా రాష్ట్ర విభజనకు అంగీకరించినట్లు అర్థం. అంత స్పష్టమైన విధానం అవలంభించిన రాజకీయ నాయకుడు, ఆ విధానానికి వ్యతిరేకంగా ఉవ్వెత్తున ఉద్యమం నడుస్తున్న ప్రాంతంలో ధైర్యంగా యాత్ర జరపడం అంటే మాటలు కాదు. నిజానికి ఆయన యాత్ర తలపెట్టినప్పుడు శ్రీకాకుళం నుంచి మొదలు పెట్టాలనుకొన్నాడు. అయితే ఆ జిల్లా తెలుగుదేశం నేతలు, కార్యకర్తలు అందుకు ధైర్యం చేయలేకపోయారు. మీరు వస్తే, గౌరవంగా స్వాగతించే పరిస్థితులు వుండకపోవచ్చుననే సందేహం వ్యక్తం చేశారు. ఏ ఒక్క సభలోనైనా ఏ ఒక్క ఆందోళనకారుడైనా అల్లరి చేస్తే, రాయి విసిరితే పరిస్థితి ప్రమాదకరంగా మారుతుందని భయపడ్డారు. కానీ చంద్రబాబులో ఆ భయాలు లేవు. ఆ సందేహాలూ లేవు. సాహసంగా యాత్ర ప్రారంభించాడు. పూర్తి చేశాడు. ఉద్యమ సమయంలో ఉద్యమ వ్యతిరేక విధానం కల్గిన నేత అదే జనం మద్యకు వెళ్లడం నమ్మలేని విషయం. అందుకు చంద్రబాబు నాయుడును అభినందించక తప్పదు.

అయితే ఈ యాత్రలో ఆయన తాను సమైక్యమా, విభజన వాదా అన్న చర్చ రాకుండా ఉపన్యాసాలను ఎటేటో తిప్పేస్తున్నాడు. రాహుల్ గాంధీని మొద్దబ్బాయి అని, జగన్‌ను దొంగబ్బాయి అని పిలుస్తున్నాడు. రూపాయి పతనం గురించి, బొగ్గు గనుల ఫైళ్ల మాయం గురించి, ప్రధాని చేతకాని తనం గురించి, అవినీతి గురించి ఉపన్యాసాలు దంచుతున్నాడు. ఈ అంశాలకు తెలుగువారి ఆత్మగౌరవానికి ఏమి సంబంధమో వినే వారికి అర్థం కావడం లేదు. సమైక్యాంధ్రకు అనుకూలంగా చిన్న మాట కూడా మాట్లాడడం లేదు. అట్లని తెలంగాణ వాదన విన్పించడం లేదు. ఉద్యమ కాలంలో రాజకీయ సభ జరిపితే, ఆ ఉద్యమం గురించి మాట్లాడడం ధర్మం. ఆ ప్రస్తావన లేకుండా ఉపన్యాసాలు ముగించడం, యాత్రను ముందుకు నడిపించడం అర్థం కాని విషయం. అయితే దానివల్ల చంద్రబాబుకు మాత్రం ఎక్కడలేని ప్రతిష్ట పెరుగుతున్నది. ధైర్యంగా జనం ముందుకు వచ్చినవాడిగా ముద్ర పడుతున్నది.

# బొమ్మ పలుకు సత్యం!




ఫేస్‌బుక్, వాటీజ్‌యాప్ వంటి సామాజిక ఇంటర్నెట్ వేదికలలో విస్తృతంగా ప్రచారమౌతున్న బొమ్మ ఇది. రాష్ట్రంలో జరుగుతున్న సమైక్యాంధ్ర ఉద్యమం పసిపిల్లల జీవితాలను ఎంతగా పాడు చేస్తున్నదో అర్థం చేసుకోవడానికి ఇదొక చిన్న దృశ్య రూప ఉదాహరణ. ఉద్యమం పేరుతో ప్రభుత్వ పాఠశాలల ఉపాధ్యాయులు నెలరోజులుగా బడులు మూసేశారు. చదువులు అటకెక్కాయి. అదే సమయంలో ప్రైవేటు స్కూళ్లు మాత్రం నిక్షేపంగా నడుస్తున్నాయి. ఉద్యమకారులు కోరినప్పుడల్లా తమ పాఠశాలలోని పసి పిల్లలను వీధులలో వూరేగించడం ద్వారా తమ మీద ఉద్యమకారుల ఒత్తిడి పడకుండా జాగ్రత్త పడుతున్నారు ప్రైవేటు స్కూళ్ల యజమానులు. ఉద్యమంలో పాలుపంచుకొంటున్నట్లు కన్పిస్తూనే తమ విద్యా వ్యాపారాన్ని నిక్షేపంగా జరుపుకొంటున్నారు. కానీ ప్రభుత్వ బడులలో చదివే పిల్లలకు మాత్రం ఆ అవకాశం లేదు. వారంతా ప్రైవేటు స్కూళ్ల భారం మోయలేని సామాన్యులు, సగటు కుటుంబీకులు, పేద పిల్లలు. దాని అర్థం ఉద్యమం వల్ల సంపన్నులు సుఖంగా వుంటే, బడుగు జీవుల బ్రతుకులు మాత్రం అధోగతి పాలౌతున్నాయని.

ఏమిటీ అన్యాయం? కేవలం ప్రభుత్వ స్కూళ్లలో చదివే పిల్లలకు మాత్రం ఈ శిక్ష ఎందుకు? ఉద్యమంలో కూడా ఇంత వివక్షత న్యాయమా? పేద పిల్లలకు చదువు అవసరం లేదా? ఉద్యమాన్ని నడిపిస్తున్న ఎన్జీఓలు, ప్రభుత్వ అధికారుల పిల్లలు కానీ, రాజకీయ నేతల పిల్లలు కానీ ప్రభుత్వ, మునిసిపల్, జిప పాఠశాలల్లో చదవరు. వేలు లక్షల ఫీజులు చెల్లించి ప్రైవేటు స్కూళ్లలో చదివిస్తారు. అందువల్ల పేద పిల్లల జీవితాలకు జరుగుతున్న చేటు వారికి అర్థం కావడం లేదు. ఒక సామాజిక అవసరం కోసం జరిపే ఆందోళనలో కూడా సమాజంలోని ఒక వర్గాన్ని మాత్రమే బలి చేయడం దురదృష్టకరం.



పెద్ద బజారులో అశ్వవాహనరూఢుడైన లంబోదరుడు.



నెల్లూరు నగరంలోని బాలాజీనగర్‌లో ప్రతిష్టించిన **36** అడుగుల గణపతి విగ్రహం.



నెల్లూరు పొగతోటలోని డాక్టర్ సత్యనారాయణమూర్తి క్లినిక్ ప్రక్కన మెకానిక్ షాపు నడిపే తిరుమలశెట్టి చంద్ర సృజనాత్మక కళాకారుడు. పర్యావరణ హితం కోరుతూ ఆయన కాగితాలు ఉపయోగించి తయారు చేసిన వినాయకుడ్ని ఆవిష్కరించిన సూక్ష్మరూప కళాఖండాల సృష్టికర్త ముసవ్వీర్.

# వారఫలాలు

*తేది 14-9-2013 నుండి 20-9-2013 వరకు మేషంలో కేతువు; మిథునంలో గురువు; కర్కాటకంలో కుజుడు; సింహంలో రవి 16తేది వరకు తదుపరి కన్యలో; కన్యలో బుధుడు; తులలో శుక్ర, శని, రాహువులు; ధనుస్సు, మకర, కుంభ, మీనాలలో చంద్రుడు సంచరిస్తారు.*




మిశ్రమ ఫలితాలుంటాయి. వృత్తి, వ్యాపార, ఉద్యోగులకు ఆర్థిక ఇబ్బందులు, ధన నష్టం జరగవచ్చు. కళత్ర సంబంధీకులతో శత్రుత్వం లేదా కొంత వ్యతిరేకత వుంటుంది. నమ్మినవారే మోసం చేస్తారు. మాతృవంశ సూతకాలుంటాయి. కోర్టు వ్యవహారాలు వాయిదా వేసుకోవడం మంచిది. రాజకీయలు ప్రజావ్యతిరేకత రాకుండా చూసుకోవాలి. సంతానానికి ఇబ్బందులు ఏర్పడే సూచనలున్నాయి.




అన్ని రంగాలవారు చేసే వృత్తి, వ్యాపారాలు లాభిస్తాయి. శరీరారోగ్యం బాగుంటుంది. ఆర్థికపరమైన ఇబ్బందులుండవు. కొన్ని విషయాలలో భయం తగ్గి ధైర్యం కలుగుతుంది. ఎటువంటివారితోనైనా మాట్లాడగలరు. తలపెట్టిన పనులన్నీ పూర్తవుతాయి. బంధుమిత్రుల వల్ల లాభం. నూతన వస్తు సామగ్రిని కొంటారు. స్త్రీ సౌఖ్యం, కుటుంబ సౌఖ్యం. దూర ప్రయాణాల వల్ల లాభం.




గ్రహానుకూలతల వల్ల తలపెట్టిన పనులన్నీ పూర్తవుతాయి. గతంలో వదిలేసిన పనులను తిరిగి చేపట్టి విజయం సాధిస్తారు. మీ ఊహలు, ఆలోచనలను కార్యాచరణలో పెట్టాలని ఆశిస్తారు. వృత్తి, ఉద్యోగ, వ్యాపార, ఇతర రంగాల వారి ఆర్థికస్థితి మెరుగౌతుంది. కుటుంబంలో జరుగు వివాహాది శుభకార్యాలను బంధుమిత్రుల సహకారంతో పూర్తి చేస్తారు. అందరితో సఖ్యత కలిగి వుండడం మేలు.




ఆదాయానికి లోటుండదు. వృత్తి, వ్యాపారులు ఆర్థికానుకూలతలను సాధిస్తారు. అన్ని రంగాల వారూ తలపెట్టిన పనులన్నీ పూర్తి చేస్తారు. వ్యవసాయానుకూలతలు సాధిస్తారు. ప్రభుత్వ సంబంధ కార్యక్రమాలందు జయం. మిత్రుల సహకారంతో దైవ సంబంధిత పనులు పూర్తి చేస్తారు. వ్యవసాయదారులకు రుణ సౌకర్యం లభిస్తుంది. కళా, క్రీడాకారులు తమ వృత్తులలో శ్రద్ధ కలిగి వుంటారు.




గ్రహానుకూలతలు మధ్యస్థంగా వున్నాయి. కొన్ని రంగాల వారికి ప్రతికూలతలతోపాటు కొన్ని ఇబ్బందులు తప్పవు. వృత్తి, వ్యాపారాల వారికి మధ్యమ లేక సామాన్య ఫలితాలుంటాయి. శరీరారోగ్య విషయంలో శ్రద్ధ చూపాలి. ఆర్థిక అసమానతలేర్పడగలవు. కొన్ని ముఖ్య కార్యాలు ఆగిపోవడం లేదా వాయిదాపడడం జరుగుతుంది. స్పెక్యులేషన్ లాభించదు. విద్యార్థులకు గల ఇబ్బందులను అధిగమించగలరు.




మనస్థిమితం తక్కువగా వుంటుంది. ఏదో ఒక సమస్య, ఇబ్బందులు ఎదుర్కోగలరు. శిరో బాధలు, మనోధైర్యం కోల్పోవుట బాధిస్తాయి. వృత్తి, వ్యాపారాలలో ఆర్థికలోటు, శత్రుభయం. కళత్ర వంశం వారితో విరోధం. కొన్ని అవమానకర సంఘటనలు ఎదుర్కొంటారు. రాజకీయుల స్థితి అయోమయంగా వుంటుంది. ఏది, ఎటు అన్న నిర్ణయానికి రాలేరు. భార్యాభర్తల మధ్య అవగాహన వుండదు.




చేపట్టిన పనులలో కొన్ని పూర్తవుతాయి. మరికొన్నిటిని వాయిదా వేయడం మేలు. వృత్తి, వ్యాపారాలలోని వారికి ఆర్థిక నష్టం. వ్యవసాయదారులకు అనేక సమస్యలు. సంతానం వల్ల ఇబ్బందులెదుర్కొంటారు. స్త్రీ మూలక వివాదాలు. అలసట, శారీరక ఇబ్బందులుంటాయి. కుటుంబ సౌఖ్యం తక్కువగా వుంటుంది. వ్యవసాయదారుల రుణ ప్రయత్నాలు ఫలిస్తాయి.




గ్రహాల ప్రతికూలత వల్ల అన్ని రకాల ఇబ్బందులెదుర్కొంటారు. వృత్తి, వ్యాపారాలందు ఆటంకాలు, నష్టాలు తప్పవు. స్పెక్యులేషన్ జోలికి వెళ్లవద్దు. శారీరక శ్రమ అధికం. నిద్రలేమి, బంధుమిత్రులతో అకాల విరోధాలు, అనైక్యత, నమ్మినవారు మోసం చేయడం వుంటాయి. కుటుంబ సమస్యలు, కోర్టు కేసులు, దొంగల భయం. వ్యవసాయదారులకు పంట ఆదాయానికన్నా రుణాలు అధికం.




గతవారం కన్నా మేలుగా వుంటుంది. వృత్తి, వ్యాపారాలలోని వారు తమ పనులలో రాణింపు, ఆర్థికంగా పుంజుకుంటారు. ఆదాయానికి లోటుండదు. అనుకొన్న కార్యాలన్నింటిలో జయం. ఇంటి విషయాలలో సోదర సాయం. మిత్రుల వల్ల కార్య లాభాలుంటాయి. వ్యవసాయానుకూలతలు, వ్యవహారానుకూలతలు సాధిస్తారు. స్పెక్యులేషన్ లాభించినా ముందు జాగ్రత్తలవసరం.




అనుకూలతలు సాధించి తలపెట్టిన కార్యాలు పూర్తి చేస్తారు. వృత్తి, వ్యాపారాలు రాణిస్తాయి. ఆర్థికాదాయాలుంటాయి. ఇంట్లో చేపట్టిన గృహమార్పులు, ఇతర విషయాలకు మిత్రుల సహకారం వుంటుంది. అనుకున్న పనులు సాధిస్తారు. స్త్రీ సౌఖ్యం, స్పెక్యులేషన్‌లో అనుకూలతలుంటాయి. అప్రయత్న కార్యసిద్ధి, పెద్దవారిని కలుసుకోవడం జరుగుతుంది. రాజకీయులు గుర్తింపు సాధిస్తారు.




చేసే వృత్తి, వ్యాపారాలలో రాణింపు అంతగా వుండదు. మానసిక, శారీరక ఇబ్బందులు, ఆరోగ్య భంగాలు. ఆదాయానికి మించిన ఖర్చులు, వృథా కాలక్షేపాలుంటాయి. అనుకున్న పనులు ఆలస్యమవడం, తరచూ అసంతృప్తి వుంటుంది. వ్యవసాయ పనులు సక్రమంగా సాగక, ఇబ్బందులుంటాయి. ఉద్యోగ స్త్రీలకు కోరుకున్న చోటకు బదలీలు, అధికారుల అనుగ్రహం వుంటుంది.




మిశ్రమ ఫలితాలుంటాయి. కొన్ని అనుకోని దుస్సంఘటనలు, చేసే వృత్తి, వ్యాపారాలలో ఆటంకాలు, నష్టాలు, అసంతృప్తులుంటాయి. తరచూ మనస్థిమితం తగ్గుట, ఆర్థిక అసమానతలు, బంధుమిత్రులతో అనవసర విరోధాలు, వాహన ప్రమాదాలు, శారీరక గాయాలుంటాయి. కుటుంబంలో అశాంతి, ప్రభుత్వ మూలక ఇబ్బందులు సంతానం వల్ల నష్టాలు, ఉద్యోగులకు స్థానచలనాలు వుంటాయి.

## పంచాంగం

14తేది క్షీరవ్రతారంభం, గజలక్ష్మీ వ్రతం.
15తేది విష్ణు పరివర్తనైకాదశి.
16తేది వామన జయంతి.
17తేది కన్యా సంక్రాంతి, విశ్వకర్మ జయంతి. ఓనం పండుగ.
18తేది అనంతపద్మనాభ వ్రతం.
19తేది ఉమామహేశ్వర వ్రతం, సావిత్రి వ్రతం.
20తేది మహాలయ పక్ష ప్రారంభం.

### శుభ ముహూర్తాలు

భాద్రపదమాసం శూన్యమాసం కావున వివాహాది శుభముహూర్తాలు లేవు. సీమంత, అన్నప్రాసనాది సామాన్య విషయాలకు ముహూర్తాలున్నాయి.

### సెప్టెంబర్ తిథులు

| | | | | | |
|---|---|---|---|---|---|
| | | భాద్రపద శుద్ధ | | | |
| 14 | శని | నవమి | ఉ | 07.15 | గం.ల.వ |
| 15 | ఆది | దశమి | రా | 04.45 | గం.ల.వ |
| | | ఏకాదశి | రా | 02.07 | గం.ల.వ |
| 16 | సోమ | ద్వాదశి | రా | 11.29 | గం.ల.వ |
| 17 | మంగళ | త్రయోదశి | సా | 08.56 | గం.ల.వ |
| 18 | బుధ | చతుర్దశి | సా | 06.38 | గం.ల.వ |
| 19 | గురు | పౌర్ణమి | ప | 04.41 | గం.ల.వ |
| | | భాద్రపద బహుళ | | | |
| 20 | శుక్ర | పాడ్యమి | ప | 03.14 | గం.ల.వ |

**అక్కరాజు బాలసుబ్రహ్మణ్యం**
7/34, దొడ్ల సుబ్బారెడ్డి నగర్, నవలాకులతోట, నెల్లూరు – 2. సెల్: 95819 76599.

# గృహస్థాశ్రమంలో చతుర్విధ పురుషార్థ ప్రదాయిని గృహం!

## వాస్తు సందేహాలు సమాధానాలు

**ఆచార్య సుబ్రహ్మణ్య మహర్షి**
4వ వీధి, గాయత్రినగర్, ఎ.కె. నగర్ పోస్టు, నెల్లూరు-4.
ఫోన్: 2322345, సెల్: 9490125878.

*డాక్టర్ లలిత — చెన్నై*

** 'గృహం' గృహస్థుకు లభింపజేసే లాభాలను గురించి 'మయమతం' చక్కగా వివరించిందంటారు నిజమేనా?*

ధర్మార్థ కామమోక్ష సాధన గృహస్థాశ్రమంలోనే మానవుడికి సాధ్యం. అంచేత పరిసర, నిర్మాణ, ఆరోగ్య, భూ భౌతిక, ఖగోళ ప్రభావాలను దృష్టిలో పెట్టుకుని గృహ నిర్మాణం చేసుకోవాలని 'మయ వాస్తు' చెబుతున్నది.

*డి.ఝాన్సీలక్ష్మి — గుంటూరు*

** 'అంకెల గారడి' గురించి విన్నారా? ఆ పద్ధతులు నమ్మదగినవేనా?*

అక్షరాల సంఖ్యల్ని తగ్గించడం, పెంచడం 'గారడి'లాగే అనిపిస్తుంది. అసలు సంఖ్యాశాస్త్రాన్ని భారతీయ శాస్త్రజ్ఞులు నిర్ధారణ చేయలేదు.

*సి.విజయారెడ్డి — సికింద్రాబాద్*

** సంఖ్యా శాస్త్ర శాస్త్రజ్ఞులు చెబుతున్నది నిజమేనా?*

ఎవరేం చెప్పినా నిరూపణలు కావాలి. అట్లా నిర్ధారణ లేనప్పుడు, ఆ శాస్త్రంకానీ ఆయా వ్యక్తులు కానీ భవిష్యత్తులో నిలబడలేరు.

*డాక్టర్ మైథిలీరెడ్డి — హైదరాబాద్*

** మేం జ్యోతిష్యాన్ని చెబుతాం. అది ఖచ్చితంగా జరుగుతుందా అంటే అది భగవంతుడికే తెలియాలి అని ఒక పుస్తకంలో ఒక శాస్త్రజ్ఞుడు ప్రకటించాడు కదా?*

అది నేను కూడా చదివాను. అది అతని వినయాన్ని, సంస్కారాన్ని సూచిస్తుంది. అయితే అది నిజం కూడా. మనిషి సృజనలు, భగవంతుడి శాసనాల ముందు విజయం సర్వాంతర్యామిదే కదా?

*వై.వి.ధరణి — విజయవాడ*

** పేరులోని అక్షరాలు మార్చడం, పేర్లు మార్చడం వల్ల జాతక ఫలితాలు మారుతాయా?*

సంఖ్యా శాస్త్ర వివరణలను గురించా మీరు చెబుతున్నది? అట్లా చేయడం వల్ల విధిలిఖితమైన జాతకాలు మారడం కల్ల. అలా చెబుతున్న వారు ఆయా విషయాలలో హామీ ఇవ్వడం లేదు.

*డి.సురేష్ — కావలి*

** పేరు మారిస్తే జాతకం ఎందుకు మారదు?*

జాతకం పుట్టిన సమయంపై ఆధారపడి వుంటుంది. పేరుపైన ఆధారపడి వుండదు కాబట్టి.

*ఎ.పి.ఆర్ — కావలి*

** 'కుజదోష'మని చెప్పాక పరిష్కారం చేయించాము. అయినప్పటికీ అత్తగారు ఎత్తిపొడుస్తూనే వున్నారు.*

సమాజంలో ఆడవాళ్లలో ఛాందసాలెక్కువ. వీళ్లకు ఎవరో ఏదో చెబుతారు. అందువల్ల శాస్త్రజ్ఞులు కాస్త జాగ్రత్త పడాలి. ఎదుటివారు శాస్త్రాన్ని ఆయుధంగా చేసుకోకుండా చూడాలి. అల్లుడి చేత ఒకసారి ఆవిడ బ్రెయిన్ వాష్ చేయించండి.

*సి.నారాయణశాస్త్రి — చెన్నై*

** పంచాంగంలోని విభాగాలు మన దేశంలో ఏవిధంగా వున్నాయి?*

సూర్య, చంద్ర సిద్ధాంతాలు భారతదేశంలో పాటిస్తున్నారు. సూర్యమానమని, చంద్రమానమని అంటారు.

*డాక్టర్ భగవతీరావు — చెన్నై*

** జ్యోతిషాన్ని ఇతర దేశాల శాస్త్రాలకంటే భిన్నమైనదిగా మీరు భావిస్తున్నారా?*

మనిషి జనన కాలాన్ని ఖచ్చితంగా నిర్ధారించినట్లయితే, భవిష్యత్తు జీవితాన్ని ఖరాఖండిగా చెప్పగలిగింది ఒక్క భారతీయ జ్యోతిష శాస్త్రమే.

*వై.గాయత్రీదేవి — సికింద్రాబాద్*

** జ్యోతిషశాస్త్రంలో సరస్వతీదేవి శాపాన్ని గురించి మీరు గమనించారా?*

భగవంతుడి నుదుటి రాతల ముందు 'మనిషి' సృష్టించిన ఏ శాస్త్రమైనా నిర్ణయాల్ని ప్రకటించలేదని దీని అర్థం. వంద శాతం వాస్తవాల్ని జ్యోతిష్కులు చెప్పగలరు నిష్ణాతులైతే. నిజమే! అయితే కొన్ని రహస్యాల్ని చెప్పకపోవడమే మంచిదని సరస్వతీదేవి శాపం చెబుతోంది.

*డాక్టర్ త్రినాథశర్మ — బెంగుళూరు*

** వాస్తు శాస్త్రాల నేపథ్యమేమిటి?*

వాస్తు శాస్త్రాలు ప్రధానమైనవి ఇరవైఎనిమిది. అప్రధానమైనవి మరో పన్నెండు కూడా వున్నాయి. ఇవన్నీ కూడా క్రీ.శ ఒకటవ శతాబ్ది నుంచి పదహారవ శతాబ్దం వరకూ రచింపబడినట్టివి.

● నెల్లూరు నగరంలో

# రోడ్ల నిర్మాణ పనుల్లో అవినీతి అక్రమాలు!

**" నగరంలో కోట్లాది రూపాయలు వెచ్చించి నిర్మిస్తున్న రోడ్ల నిర్మాణం పనులు పరమ అధ్వాన్నంగా జరుగుతున్నాయి. ప్రజాప్రతినిధుల ఇళ్లలోని వ్యక్తులే బినామీ అవతారమెత్తి ఈ పనులను పరమనాసిరకంగా చేస్తున్నా ప్రశ్నించే అధికారి లేకుండా పోయారు. "**

నెల్లూరు మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో జరుగుతున్న రోడ్లు, కాల్వల నిర్మాణాలను పర్యవేక్షించే వారు కరువయ్యారు. సిమెంటు రోడ్ల నిర్మాణాలకు సంబంధించి ప్రతిపాదనలు రూపొందించి, ఆతర్వాత టెండర్ల ద్వారా కాంట్రాక్టర్లకు పనులు అప్పగించిన కార్పొరేషన్ ఇంజనీరింగ్ విభాగం అధికారులు పర్యవేక్షణ, తనిఖీల బాధ్యతలు విస్మరించారు. కోట్ల రూపాయల వ్యయంతో ప్రజల అవసరాల నిమిత్తం చేపట్టిన పనుల్లో నాణ్యతా ప్రమాణాలు లోపిస్తున్నాయి. పనులు నాసిరకంగా వుండడంతో కొన్ని నెలలకే దుస్థితికి చేరే అవకాశం వుంది. అధికార పార్టీకి చెందిన ప్రజా ప్రతినిధుల ఇళ్లలోని వ్యక్తులే కాంట్రాక్టర్లు కావడం వల్ల అధికారులు నిర్మాణ పనుల్లో లోపాలను గుర్తించడంలో వెనుకంజ వేస్తున్నట్లు తెలుస్తుంది. ఇష్టానుసారంగా చేస్తున్న పనుల కారణంగా నగర ప్రజలు తీవ్ర అసహనం వ్యక్తం చేయడం తప్ప ఏమీ చేయలేని పరిస్థితి.

### రూ. 48 కోట్ల పనులు

మునిసిపల్ కార్పొరేషన్ పరిధిలో ప్రస్తుతం 48 కోట్ల రూపాయల వ్యయంతో వివిధ రోడ్ల నిర్మాణపు పనులు జరుగుతున్నాయి. నగరంలో మినీబైపాస్ రోడ్డు, జాతీయ రహదారి, వివిధ ప్రధాన రహదారులను అనుసంధానంచేసే విధంగా లింకు రోడ్ల ఏర్పాటుకు శ్రీకారం చుట్టారు. లింకు రోడ్ల ఏర్పాటు కోసం విడుదలైన నిధులతో ఇతర సిమెంటు రోడ్లు నిర్మిస్తున్నారన్న ఆరోపణలున్నాయి. నగరంలో రోజురోజుకు పెరిగిపోతున్న వాహనాలతో రాకపోకలకు తీవ్ర ఆటంకం ఏర్పడుతుంది. ప్రధాన రహదారులను కలుపుతూ రోడ్లు నిర్మిస్తే వాహనాలను మళ్లించవచ్చు. వేదాయపాళెం సెంటర్ నుండి గాంధీనగర్, చైతన్యపురి మీదుగా పొదలకూరు వెళ్లే రహదారిని కలిపేందుకు రోడ్డు నిర్మాణం కోసం దాదాపు 80 లక్షల రూపాయలతో టెండర్ పిలిచారు. ఈ టెండర్‌ను రూరల్ ఎమ్మెల్యే అనుచరునిగా వుండే ఓ మాజీ కార్పొరేటర్ దక్కించుకున్నాడు.

గాంధీనగర్ నుండి వివిధ ప్రాంతాలకు వెళ్లే రహదారుల నిర్మాణానికి మరో మూడు కోట్ల రూపాయలతో అంచనాలు రూపొందించారు. ఇప్పటివరకు లింకు రోడ్ల నిర్మాణానికి సంబంధించి దాదాపు 15 కోట్ల రూపాయలు విడుదలైనట్లు తెలిసింది. కార్పొరేషన్ ఇంజనీరింగ్ విభాగం అధికారులు, సిబ్బంది సకల జనుల సమ్మెలో వుండడంతో పూర్తి వివరాలు వెల్లడి కావడం లేదు. మరో ప్రక్క నెల్లూరు రూరల్, నగర ఎమ్మెల్యేలు మాత్రం శంకుస్థాపనలు, ప్రారంభోత్సవాలు చేసుకుంటూ పోతున్నారు. ఎమ్మెల్యేల అనుచరులు సూచించిన ప్రాంతాల్లోనే పనులు జరుగుతున్నాయి. ప్రతిపక్ష పార్టీలకు చెందిన నేతలు వుండే వార్డుల్లో పనులు చేపట్టడం లేదన్న విమర్శలు వినిపిస్తున్నాయి. కార్పొరేషన్ అధికారులు సైతం ప్రజల అవసరాలకనుగుణంగా పనులు చేయడంలో విఫలమౌతున్నారు.

### డ్రైనేజీలను మరచిన ఆర్అండ్‌బి

నగరంలో ప్రధాన రహదారిపై సిమెంటురోడ్డు నిర్మాణం చేపట్టిన రోడ్లు, భవనాలశాఖ అధికారులు ఇరువైపులా డ్రైనేజి కాల్వలను నిర్మించడం మరిచారు. వర్షం కురిసినప్పుడు, వరదలు వచ్చినప్పుడు రోడ్డుపై నుండి నీరు బయటకు వెళ్లాలంటే డ్రైనేజి కాల్వలు తప్పనిసరి. ముందస్తు ప్రణాళిక లేకుండా సిమెంటు రోడ్డు నిర్మాణ పనులు పూర్తి చేశారు. జిల్లా కోర్టు ఎదురుగా నిర్మాణం చేపట్టిన సమయంలో కొందరు న్యాయవాదులు పనులు అడ్డుకుని డ్రైనేజి కాల్వలు ఎందుకు నిర్మించడం లేదని ప్రశ్నించడం జరిగింది. కానీ అధికారులు మాత్రం న్యాయవాదుల ప్రశ్నకు సరైన సమాధానం చెప్పలేక తడబడాల్సి వచ్చింది. భారీ వర్షాలు వస్తే వర్షపు నీరు వెళ్లే మార్గంలేక రోడ్డుపైనే నిల్వవుండే అవకాశం వుంది. మొత్తంమీద నగరంలో జరుగుతున్న రోడ్డు నిర్మాణ పనుల్లో భారీ ఎత్తున అక్రమాలు జరుగుతున్నాయన్నది వాస్తవం.

ప్రాణాలు హరీ

# జాతీయ రహదారిపై మరణ మృదంగం!

**● ప్రయాణానికి జాతీయ రహదారులు అనుకూలంగానే ఉన్నా వేగ నియంత్రణ లేకపోవడం, ఎక్కడంటే అక్కడే నిలిచిపోయే వాహనాలు, క్రాసింగులు వాహనాలు నడిపే వారిపై యమపాశాలు విసురుతున్నాయి.**

జిల్లా రహదారులు మృత్యుకూపాలుగా మారుతున్నాయి. ప్రతిరోజు రహదారుల్లో వాహనాలు ప్రమాదాలకు గురై ప్రజలు దుర్మరణం చెందుతున్నారు. గతంలో ఇరుగ్గా వున్న రహదారుల్లో వాహనాలు వెళ్లేందుకు ఇబ్బందిగా వుండేది. 30 కిలోమీటర్ల ప్రయాణానికి గంటకు పైగా సమయం పట్టేది. ఎన్డీఏ ప్రభుత్వ హయాంలో దేశవ్యాప్తంగా అన్ని జాతీయ రహదారులను నాలుగు లైన్లుగా మార్పు చేయడం జరిగింది. నాలుగు లైన్లుగా విస్తరించిన తర్వాత వాహనాల వేగానికి పరిమితి లేకుండా పోయింది. అతి వేగం కారణంగా అదే రీతిలో ప్రమాదాలు సంభవించి ప్రజల ప్రాణాలు గాల్లో కలిసి పోతున్నాయి.

ఇటు ప్రభుత్వంగానీ, అటు నేషనల్ హైవే అథారిటీగానీ ప్రమాదాల నివారణకు చర్యలు తీసుకోవడంలో పూర్తిగా విఫలం చెందుతున్నాయి. మన జిల్లాలో తడ నుంచి ప్రకాశం జిల్లా సరిహద్దులోని వెట్టవరకు జాతీయ రహదారిలో క్రాసింగ్ ఏర్పాటుచేసి వున్నారు. ఇక్కడ క్రాసింగ్‌ను సూచించే సూచిక బోర్డులు ఏర్పాటు చేయడం అధికారులు మరిచిపోయారు. అలాగే ఇరువైపులా వున్న రహదారులకు మధ్య నాటిన మొక్కలు బాగా పెరిగి రాత్రి సమయంలో వాహనాలు కనిపించని పరిస్థితి. క్రాసింగ్ వద్ద రోడ్డుదాటే సమయంలో పాదచారులతోపాటు ద్విచక్రవాహనదారులు ప్రమాదాల బారినపడి మరణిస్తున్నారు. జాతీయ రహదారిపై ఎక్కడపడితే అక్కడ లారీలను నిలిపి వేయడం వల్ల వెనుక వైపు నుండి వచ్చే వాహనాలకు కనిపించక ముందు వైపు వుండే వాహనాలను ఢీ కొడుతున్నాయి.

### మృతుల్లో విద్యార్థులే ఎక్కువ

రోడ్డు ప్రమాదాల్లో మరణిస్తున్న వారిలో అధిక భాగం విద్యార్థులే వున్నారు. ఇంటర్ నుండి ఇంజనీరింగ్ చదివే విద్యార్థులు ద్విచక్ర వాహనాలపై కళాశాలలకు వెళ్తున్న సమయంలోనూ, ఇతర కార్యక్రమాలకు హాజరవుతున్న సందర్భంలోనూ ప్రమాదాలు జరుగుతున్నాయి. తల్లితండ్రులు కూడా తమ పిల్లల భవిష్యత్తు గురించి ఆలోచన చేయకుండానే ఖరీదైన బైకులు కొనిస్తున్నారు. ఒకే వాహనంపై ముగ్గురు ప్రయాణిస్తూ మితిమీరిన వేగంతో నడపడం కారణంగా బైక్‌ను అదుపు చేయలేక ఎదురుగా వస్తున్న వాహనాలను ఢీ కొడుతున్నారు. పోలీస్ గణాంకాల ప్రకారం గత సంవత్సరం పది మంది విద్యార్థులు దుర్మరణం చెందగా, ఈ సంవత్సరం ఐదు మంది మరణించడం జరిగింది.



ప్రమాదంలో తుక్కైన ఆటో.

గత వారంలో కొడవలూరు మండలం నాయుడుపాళెం సమీపంలో రోడ్డు దాటుతున్న ఇద్దరు విద్యార్థులను కారు ఢీ కొనడంతో అక్కడికక్కడే మృత్యువాత పడ్డారు. మనుబోలు సమీపంలో ముందు ఆగి వున్న లారీ కనిపించక వెనుక నుంచి వచ్చిన కారు ఢీ కొనడంతో ఇద్దరు మహిళలు మరణించడం జరిగింది. ప్రజల ప్రాణాలు గాలిలో కలిసిపోకుండా నేషనల్ హైవే అథారిటీ అధికారులు, ప్రభుత్వం స్పందించి రోడ్డు ప్రమాదాల నివారణకు కఠిన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

# తుఫాన్ తుస్సు!



అల్లూరు రహీం

అమితాబచ్చన్‌ను సూపర్ స్టార్ చేసిన చిత్రం జంజీర్. తెలుగులో ఈ చిత్రాన్ని ఎన్టీఆర్ హీరోగా నిప్పులాంటి మనిషి పేరుతో రీమేక్ చేశారు. పాత రోజులకు పక్కాగా సరిపోయే కథ కాబట్టి ప్రేక్షకులు కూడా బాగా ఆదరించారు. దశాబ్దాల గ్యాప్ తర్వాత జంజీర్ చిత్రంలో కొన్ని మార్పులు చేసి రామ్‌చరణ్ తేజను బాలీవుడ్‌లో అరంగేట్రం చేయించిన చిత్రం తుఫాన్. ఈ చిత్రాన్ని హిందీలో జంజీర్ పేరుతోనే విడుదల చేశారు. తెలుగులో డబ్బింగ్‌కు మాత్రం తుఫాన్ అని పేరు పెట్టారు. పెద్ద పెద్ద కార్పొరేట్ సంస్థలు రిలయన్స్ ఎంటర్‌టైన్‌మెంట్, అమితాబ్ మెహ్రా ఫ్లయింగ్, థర్టిల్ ఫిలిమ్స్, రాంపేజ్, మోషన్ పిక్చర్స్ సంయుక్తంగా అపూర్వ లాఖియా దర్శకత్వంలో తీసిన ఈ తుఫాన్ తుస్సుమన్నది. కారణం కథకు సరియైన ట్రీట్‌మెంట్ చేయక పోవడం. బోరింగ్ ఎక్కువ కావడం. వినోదపు పాళ్లు తగ్గడం. హిందీ చిత్రం కోసం మూడు ఐటమ్ పాటలు ప్రత్యేకంగా పెట్టినట్లుంది. తెలుగులో చంద్రబోస్ ఈ పాటలు సరిగ్గా వ్రాయలేక పోయాడు. బొంబాయిలో నేనుంటా పల్లవితో సాగే పాట మినహా మిగతా పాటలు అస్సలు బాగాలేవు. మీత్ బ్రదర్స్, చిరంతన్‌భట్, ఆనందరాజ్ ఆనంద్ వంటి అగ్ర సంగీత దర్శకులు ఈ చిత్రానికి పనిచేసినా జనరంజకమైన సంగీతమందివ్వలేక పోయారు. ప్రియాంక చోప్రాలాంటి జిగేల్ మనిపించే హీరోయిన్‌ను పెట్టి రెండు మంచి పాటలు తీయలేక పోయాడంటే దర్శక వైఫల్యంగాక మరేమిటి? అసలు రామ్‌చరణ్‌కు ప్రియాంక చోప్రాకు జత కుదరలేదనాలి. షేర్‌ఖాన్, ఎసిపి విజయఖన్నాతో ఎందుకు స్నేహం చేస్తాడనే సన్నివేశానికి పట్టులేదు. గతంలో ప్రాణ్‌లాంటి గొప్ప నటుడు చేసిన ఈ పాత్రకు శ్రీహరి చాలలేదు. మెయిన్ విలన్ రుద్రప్రతాప్ తేజ పాత్రను




ప్రకాష్‌రాజ్ వంటి నటునిచేత చేయించడంలోనూ దర్శకుడు విఫలమయ్యాడు. తెలియని హిందీ ముఖాలు, నేటివిటీ లోపించడం వంటివన్నీ వెరసి తుఫాన్‌ను బలహీనపర్చి పారేశాయి. హీరోకు పంచ్ డైలాగులు వ్రాయడంలో మాటల రచయితలు విఫలమయ్యారు. షేర్‌ఖాన్ పాత్ర చేత పఠాన్‌కా బచ్చా... జబాన్‌కా సచ్చా, ప్రకాష్‌రాజ్ కోసం ఓల్టేజ్‌కు మైలేజ్ ఎక్కువ, సౌండ్‌తో కాదు సైలెంట్‌గా పనిచేస్తా వంటి క్యాచీ డైలాగులు వ్రాశారు. తెలుగు తుఫాన్‌కు అవసరమైన కొన్ని దృశ్యాలను దర్శకుడు యోగితో చేయించినా ఆయన చేసిందేమిటో తెరపై కనపడనేలేదు.

చిత్ర కథలోనికి వెళ్తే ఎసిపి విజయఖన్నా(రామ్‌చరణ్) డ్యూటీ కచ్చితంగా చేసే అధికారి కావడంతో రాష్ట్రంలోని అన్ని జిల్లాలకు బదలీ చేస్తారు. ఇక కుదరదని ముంబాయికి పంపుతారు. అక్కడ ఆయిల్ మాఫియాకు నాయకుడు రుద్రప్రతాప్ తేజ(ప్రకాష్‌రాజ్), అతని మనిషి కఠారియా ఒక సబ్ కలెక్టర్‌ను చంపేస్తాడు. న్యూయార్క్ నుంచి ఇండియా వచ్చిన మాల(ప్రియాంక చోప్రా) ఈ హత్య చూస్తుంది. ఈ కేసు విచారణ చేస్తూ విజయఖన్నా మాలకు దగ్గరవుతాడు. స్టేషన్ లాకప్‌లోని కఠారియా చనిపోవడంతో విజయఖన్నాను సస్పెండ్ చేస్తారు. క్రైం జర్నలిస్ట్ జైదేవ్(తనికెళ్ల భరణి) ఇచ్చే సమాచారంతో రుద్రప్రతాప్ తేజ ఆయిల్ మాఫియా సామ్రాజ్యాన్ని విజయఖన్నా కుప్పకూలుస్తాడు. చిన్నప్పుడు తన తల్లి, తండ్రిని చంపింది కూడా రుద్రప్రతాప్ అని తెలియడంతో అతన్ని అంతమొందించి మాలను తనదాన్ని చేసుకోవడంతో తుఫాన్ ముగుస్తుంది.

రామ్‌చరణ్ తేజ ఫైట్లు, డ్యాన్స్ బాగా చేస్తాడు. కానీ దర్శకుడు అపూర్వ లాఖియా ఆయన్ను ఉపయోగించుకోవడంలో విఫలమయ్యాడు. ఏదో తీయాలని తలపోసి ఏదేదో తీసి మొత్తాన్ని తెలుగులో 'రచ్చ' చిత్రంతో జయకేతనం ఎగురవేసిన రామ్‌చరణ్ తుఫాన్‌తో ఢీలా పడేలా చేశాడు అపూర్వ లాఖియా. మెగా కుటుంబ అభిమానులను కూడా తుఫాన్ అలరించడం లేదంటే దీనికి దర్శకుడే బాధ్యత వహించాలి.

## బాగా దగ్గరైన సమంత, సిద్దార్థ్!



హీరోయిన్ సమంత, హీరో సిద్దార్థ్ గత కొంతకాలంగా ప్రేమ పక్షులుగా కావాల్సినంత ప్రచారం సంపాదించుకొన్నారు. మా ఇద్దరి మధ్య ఏమీలేదని కొన్ని రోజులు; అన్నీ చెప్తారేంటి అని ఇంకొంత కాలం మీడియాకు మస్కా కొట్టారు. ట్విట్టర్ల ద్వారా మాత్రం ఒకరిపై ఒకరు తమకున్న ప్రేమను చాటుకొన్నారు. ఇప్పుడు వివాహాది కార్యాలకు కలిసే వెళ్తున్నారు. ఈ మధ్య ఓ పెళ్లికి అతిథులుగా వెళ్లి తోడి పెళ్లికొడుకు, పెళ్లి కూతురు అవతారాలెత్తి దగ్గరుండి పెళ్లి జరిపించి వచ్చారట. మరి వీళ్లెప్పుడు ఓ ఇంటి వారవుతారో? ముందు సినిమాలు, ఆ తర్వాత మిగతా విషయాలు అని సమంత చెబుతున్నా సిద్ధూ కోసం సినిమాల్ని కూడా వదులు కొంటోందనే టాక్ వినిపిస్తోంది.

## వర్మ పట్టపగలు



దర్శకుడు రాంగోపాల్ వర్మకు భయపెట్టడం అంటే మహా సరదా. ప్రేక్షకులకు ముచ్చెమటలు పట్టించడానికి ఆయన భేతాళ ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. అర్థరాత్రి చీకట్లో కెమెరాను తిప్పడం, చిన్న చిన్న బొమ్మల్ని చూపించి భయపెట్టడం, రకరకాల కోణాల్లో కెమెరాను అమర్చడం ఆయన శైలి. అయితే అవేమీ సత్ఫలితాలివ్వలేదు. దీంతో కొత్త దారిలో వెళ్లడానికి ఆయన 'పట్ట పగలు' అని సినిమాకు పేరు పెట్టారు. భయ పెట్టడంలో ఇదో కొత్త కోణం. చీకట్లోనే కాదు, వెలుగులోనూ భయ పెట్టొచ్చని నిరూపిస్తానంటున్నాడు వర్మ.

## హరికి ఎన్టీఆర్ ఛాన్స్?

సెల్వరాఘవ, బొమ్మరిల్లు భాస్కర్, సముద్రఖని తమిళులే అయినా తెలుగు చిత్రాల దర్శకులుగా పేరుగాంచారు. ఇప్పుడు మరో తమిళ దర్శకుడు తెలుగులో ఓ సినిమా తీయను కసరత్తు చేస్తున్నాడు. ఆయనే హరి. సింగం సినిమాతో భారతీయ చలనచిత్ర పరిశ్రమని తనవైపుకు తిప్పుకొన్న దర్శకుడాయన. ఈ కథ ఏ భాషకు వెళ్లినా హిట్ కొట్టింది. రెండో భాగం సింగం-2కు ఆదరణ లభించింది. ఇప్పుడీ దర్శకుడు నేరుగా తెలుగులో సినిమా తీయను రంగం సిద్ధం చేసుకొంటున్నాడు. ఓ కథను సిద్ధం చేసుకుని ఎన్టీఆర్‌కు విని పించాడట. ప్రస్తుతం రామయ్యా వస్తావయ్యా సినిమా బిజీలో ఉన్న ఎన్టీఆర్ ఓకె చెబితే హరి తెలుగు దర్శకుడైపోతాడు.

## ప్రేమాయణం



బాలీవుడ్ హీరో ఉదయ్‌చోప్రా, హీరోయిన్ నర్గీస్ ఫక్రీ మధ్య ప్రేమాయణం సాగుతోందని జోరుగా ప్రచారం సాగుతుంది. ఉదయ్‌తో అనుబంధం ఉండటంతోనే వాళ్ల కుటుంబం ఇచ్చిన విందుకు నర్గీస్ ఫక్రీ హాజరైందట. త్వరలోనే వీళ్లు పెళ్లి చేసుకోబోతున్నారని ప్రచారం సాగుతోంది. ఇదే విషయాన్ని ఫక్రీని అడిగితే ఉదయ్ నాకు నటుడిగానే పరిచయం. సహచర నటుడు అనే ఓ చిన్న అనుబంధంతోనే వారి కుటుంబం ఇచ్చిన విందుకు హాజరయ్యాను. సినిమా పరిశ్రమలో ఒకరి వేడుకలకు మరొకరు హాజరు కావడం సహజమే. పరిచయాలు, స్నేహాల్ని ప్రేమగా భావించాల్సిన అవసరం లేదంటుంది నర్గీస్ ఫక్రీ.

## లారాదత్తా సెకండ్ ఇన్నింగ్స్!



సినీ హీరోయిన్లకు సెకండ్ ఇన్నింగ్స్‌పై మోజు పెరుగుతుంది. శ్రీదేవి, మాధురీదీక్షిత్ తదితర హీరోయిన్లంతా హిందీ చిత్రసీమలో సందడి చేస్తున్నారు. ఈ జాబితాలో ప్రస్తుతం లారాదత్తా కూడా చేరింది. దర్శకుడు శశాంక్ తీస్తున్న 'చలో చైనా' చిత్రంలో ఆమె ముఖ్య పాత్ర పోషిస్తుంది. ఇందులో వినయ్ పాఠక్ కూడా నటిస్తున్నాడు. గతంలో చలో ఢిల్లీగా ప్రేక్షకుల ముందుకు వచ్చిన సినిమాకు ఇది సీక్వెల్. సెకండ్ ఇన్నింగ్స్ గూర్చి లారాదత్తా మాట్లాడుతూ హీరోయిన్‌గా చేయాలని కోరుకోవడం లేదు. నేను ఒక బిడ్డకు తల్లి అయ్యాను. నాకు సరిపోయే పాత్రలొస్తే తప్పకుండా చేస్తానని చెప్పుకొచ్చింది.

# పోలీసుల్లో చోరకళా ప్రావీణ్యం!



సిసిఎస్‌లో పోలీసులు స్వాధీనం చేసుకొన్న వాహనాలు.

ఇటీవల కొంతకాలంగా నగరంలో దొంగతనాలు, నమ్మించి వంచించడాలు అధికమయ్యాయి. పోలీసు యూనిఫాంను తలపించే దుస్తులు ధరించి, తాము పోలీసులమని చెప్పుకొంటూ నగలు క్షణాల్లో తస్కరించే ముఠాలు సంచరిస్తున్నాయి. వారిని పట్టుకోవాల్సిన పోలీసులు కొందరు వాళ్లకేమీ తీసిపోని రీతిలో స్టేషన్లలో వుండే వాహనాల విడి భాగాలను తస్కరిస్తూ తాము దొంగలకు ఏమాత్రం తీసిపోమనే తరహాలో వ్యవహరిస్తుండడం విమర్శలపాలౌతుంది. జిల్లాలోని పలు పోలీస్ స్టేషన్లకు దొంగ వాహనా

## ● వాహనాల వస్తువులు మాయం చేస్తున్నారు

లను, దొంగల నుండి రికవరీ చేసిన వాహనాలను తీసుకొచ్చి పెడుతుంటారు. అలాంటి వాహనాల నుంచి ఆయా స్టేషన్లలో పనిచేసే కొందరు పోలీస్ సిబ్బందే తమకు నచ్చిన విడి భాగాలను, తమ వాహనానికి అవసరమైన వాటిని స్టేషన్లో వుండే వాహనాల నుంచి తస్కరించి తమ వాహనాలకు బిగించుకొంటుండడం విమర్శకు దారి తీస్తుంది. ఇవి కాక దొంగల నుంచి స్వాధీనం చేసుకొన్న వాహనాలను సొంతానికి వాడుకొంటున్నారట కొందరు పోలీసులు. వీటిపై ఎలాంటి తడబాటు లేకుండా సొంత వాహనం మాదిరిగా తిరుగుతుండడం, వాటిని అమ్మబోయి వ్యవహారం బెడిసి కొట్టడంలాంటి ఘటనలు జరిగినట్లు సమాచారం. ద్విచక్ర వాహనాలను కాకుండా స్టేషన్లో వుంచిన కార్లను సొంతానికి వినియోగిస్తుండడంపై గగ్గోలు రేగుతుంది. పోలీసులకు, దొంగలకు తేడా లేనట్లు వ్యవహరిస్తున్న ఇలాంటి చోరకళ గల పోలీసులపై చర్యలు చేపట్టి పోలీస్ శాఖ పరువు రోడ్డు పాలు కాకుండా చూడాలని పలువురు ఉన్నతాధికారులను కోరుకొంటున్నారు.

# నిలిచిపోయిన పన్నుల చెల్లింపు!

## ట్రెజరీ ఉద్యోగుల గైర్హాజరే కారణం

జిల్లావ్యాప్తంగా ప్రభుత్వ ఖజానాకు జమ కావాల్సిన వివిధ రకాల పన్నులు పూర్తిగా నిలిచిపోయాయి. రాష్ట్రాన్ని సమైక్యంగా వుంచాలని డిమాండ్ చేస్తూ ప్రభుత్వ ఉద్యోగులు సకల జనుల సమ్మెలో వుండడంతో పన్నులు కట్టించుకునే వారు లేకుండా పోయారు. ప్రధానంగా రెవిన్యూ, రవాణా శాఖకు సంబంధించిన పన్నులు ఖజానా శాఖ ద్వారా జాతీయ బ్యాంకులో చెల్లించాల్సి వుంటుంది. రెవిన్యూ శాఖకు సంబంధించి శిస్తు వసూళ్ల నగదు, రవాణా శాఖకు వాహనాల పన్నులు ఖజానాకు ప్రతిరోజూ లక్షలాది రూపాయలు జమ కాబడుతుంటాయి. సకల జనుల సమ్మె కారణంగా కార్యాలయాలు మూసివేయడంతో వాహనదారులు ఇబ్బంది పడుతున్నారు. పోలీసులు వాహనాలు తనిఖీ చేసిన సమయంలో ట్యాక్స్ చెల్లించకుంటే జరిమానా విధిస్తున్నారు. దీనికితోడు ఇసుక అక్రమ రవాణాచేసే వాహనాలు, జాతీయ రహదారిపై నిబంధనలకు విరుద్ధంగా తిరిగే వాహనాలు పోలీసులు పట్టుకొంటున్నారు. వీటిని పోలీస్‌స్టేషన్‌కు తరలించి రవాణా శాఖ అధికారులు, భూగర్భ గనుల



నిర్మానుష్యంగా నెల్లూరు సబ్‌ట్రెజరీ.

శాఖ అధికారులకు సమాచారం అందిస్తున్నారు. పట్టుబడిన వాహనాలను విడిపించుకోవాలంటే అధికారులు విధించిన జరిమానాను ఖజానా కార్యాలయం ద్వారా చెల్లించి, రశీదును అధికారులకు సమర్పించాలి. ప్రస్తుతం సమ్మె కారణంగా పన్నులు చెల్లించే అవకాశం లేకపోవడంతో పట్టుబడిన వాహనాలు పోలీస్‌స్టేషన్లలోనే వుండిపోవాల్సి వస్తుంది.

# రోడ్లు త్రవ్వేస్తున్నారు!

## అయినా పట్టించుకోని కార్పొరేషన్

నగరంలో లక్షలాది రూపాయలు ఖర్చుచేసి నిర్మించిన సిమెంటు రోడ్లపై గుంతలు త్రవ్వేస్తున్నారు. వినాయకచవితి విగ్రహాల ప్రతిష్ట కోసం నగరంలో పోటీపడి ఏర్పాట్లు చేశారు. నిత్యం రాకపోకలు సాగించే రహదారులను ఆక్రమించి విగ్రహాలను నెలకొల్పుతున్నారు. పోలీస్ శాఖ నుండి అనుమతి పొందినా, పొందకపోయినా ఎవరూ పట్టించుకోవడం లేదు. చవక కొయ్యలతో రోడ్డుకు అడ్డంగా కట్టి సెట్టింగ్‌లను ఏర్పాటు చేశారు. రాకపోకలు స్తంభించి నగర వాసులు ఇబ్బంది పడినా ఏమాత్రం లెక్కచేయని పరిస్థితి. మునిసిపల్ కార్పొరేషన్ లక్షల వ్యయంతో నిర్మించిన సిమెంట్ రోడ్లపై భారీ గుంతలు త్రవ్వి తిరిగి వాటిని పూడ్చకుండా అలాగే వదిలేస్తున్నారు. సిమెంటు రోడ్డుపై ఒకసారి గుంత తీస్తే వర్షం వచ్చినప్పుడు అది మరింత పెద్దదిగా ఏర్పడి



గుంజలు పాతను రోడ్డు త్రవ్వేసిన దృశ్యం.

పాదచారులకు ఇబ్బంది కలిగిస్తుంటుంది. గుంతలు త్రవ్వడం కారణంగా కొన్ని నెలలకే వేసిన సిమెంటు రోడ్డు అధ్వాన్నంగా తయారవుతుంది. సిమెంటు రోడ్లపై గుంతలు త్రవ్వుతున్నా మున్సిపల్ కార్పొరేషన్ అధికారులు చూసీచూడనట్లు వ్యవహరిస్తున్నారు. ఇప్పటికైనా కమిషనర్ స్పందించి సిమెంటు రోడ్లపై ఎటువంటి గుంతలు త్రవ్వకుండా అవసరమైన చర్యలు తీసుకోవాల్సిన అవసరం వుంది.

# దారి తప్పుతున్న యువత!

## ● చదువుతోపాటు దొంగతనాలు!

విలాసాలకు, విచ్చలవిడి ఖర్చులకు అలవాటు పడిన యువకులు అడ్డదారులు తొక్కుతూ చిన్నతనంలోనే నేరస్తులుగా, దొంగలుగా మారుతున్నారు. సమాజంలో మంచి కుటుంబ నేపథ్యం గల్గిన యువకులు, మధ్యతరగతి కుటుంబీకులకు చెందిన పిల్లలు, మంచి ఉద్యోగాలు చేస్తూ కూడా ఇలాంటి అడ్డదారులు తొక్కుతూ దొంగతనాలకు, దోపిడీలకు, నేరాలకు పాల్పడుతుండడం సమాజంలో యువకులు ఎలా పెడదారి పడుతున్నది తెలుపుతుంది. గతంలో ఒకటి రెండు సందర్భాలలో దొంగలను పట్టుకొన్నప్పుడు ఇలాంటి యువకులు, కళాశాలలో చదివే విద్యార్థులే వున్న విషయం పోలీసులు వెల్లడించారు. మొన్న ఒక మహిళ హత్యకేసులో ఇంజనీరింగ్ చదివే పిల్లలు, పాలిటెక్నిక్ చదివే పిల్లలు వున్నారు. భక్తవత్సలనగర్‌కు చెందిన ఒక ఉద్యోగి కుమారుడు బైక్ దొంగతనాలు చేస్తూ ఇటీవల పోలీసులకు దొరికాడు. తాజాగా జిల్లాలో వరుస దొంగతనాలకు పాల్పడుతున్న ముఠా పోలీసులకు దొరికింది. వీరిలో పలువురు కళాశాలల్లో చదువుకొనే విద్యార్థులు కాగా, ఒక వ్యక్తి ప్రముఖ గోల్డ్ రుణాలు అందించే సంస్థలో బ్రాంచి మేనేజర్



దొంగల వివరాలు చెప్తున్న ఎస్పీ రామకృష్ణ.

స్థానంలో ఉద్యోగం చేస్తుండడం విశేషం. వీరందరూ ఒక ముఠాగా ఏర్పడి బైకులు దొంగిలించడం, ఇళ్లలో దొంగతనాలకు పాల్పడి, చివరకు పంపకాల్లో తేడాలొచ్చి ఆ ముఠాలో ఒక వ్యక్తిని హత్యచేసి కాలువలో పడేయడం వరకు వెళ్లడం వారిలో దాగివున్న నేరస్వభావాన్ని తెలియజేస్తోంది. చిల్లర దొంగతనాల ముఠాలు ఇళ్లలో భారీ చోరీల వరకు ఒకవైపు కళాశాలల్లో చదువుకొంటూనే మరొకవైపు విలాసాల కోసం, విచ్చలవిడిగా జీవించేందుకు నేరస్తులుగా మారుతుండడం నేటి యువకుల మనస్తత్వాన్ని, దారి తప్పుతున్న వారి నడవడికను మొదట్లోనే తల్లితండ్రులు, పోలీసులు గుర్తించి గాడిలో పెట్టకపోతే భవిష్యత్తులో మరింతగా నేరాలు పెరిగే ప్రమాదం వుంది.

# ఎస్సీ, ఎస్టీ ఉపప్రణాళిక అమలేది?

## దళిత, గిరిజన వాడల్లో విద్యుత్ సరఫరా నిలిపివేత

ఎస్సీ, ఎస్టీల అభివృద్ధి, సంక్షేమం కోసం ప్రత్యేకంగా అమల్లోకి తెచ్చిన ఉప ప్రణాళిక చట్టం వారి పాలిట శాపంగా మారింది. ఈ ఆర్థిక సంవత్సరం ఈ చట్టం క్రింద ప్రత్యేక నిధులు కేటాయించి ఎస్సీ, ఎస్టీల అభివృద్ధికి కృషి చేస్తామని ప్రకటించిన ప్రజాప్రతినిధులు ప్రస్తుతం ఏర్పడిన ఇబ్బందుల గురించి ఏమాత్రం పట్టించుకోలేదు. ఇందిరమ్మ బాట కార్యక్రమం ద్వారా జిల్లాలో రెండు దఫాలు సిఎం కిరణ్‌కుమార్‌రెడ్డి పర్యటించారు. ఈ సందర్భంగా సూళ్లూరుపేటలో ఎస్సీ, ఎస్టీ ఉప ప్రణాళిక చట్టాన్ని ప్రారంభించారు. ఎస్సీ, ఎస్టీ కాలనీల్లో 50 యూనిట్లలోపు విద్యుత్ వినియోగానికి బిల్లులు చెల్లించనవసరం లేదని, ఈ మొత్తాన్ని సబ్‌ప్లాన్ నిధుల ద్వారా ప్రభుత్వం చెల్లించడం జరుగుతుందని మంత్రులు, జిల్లా కలెక్టర్, ప్రజాప్రతినిధుల సమక్షంలో సిఎం ప్రకటించారు. సిఎం ప్రకటన వచ్చిన తర్వాత 50 యూనిట్లలోపు విద్యుత్ బిల్లులు వచ్చిన ఎస్సీ, ఎస్టీలు బిల్లులు చెల్లించడం మానేశారు. గత రెండు నెలల నుంచి బిల్లులు చెల్లించక పోవడంతో ట్రాన్స్‌కో సిబ్బంది విద్యుత్ సర్వీస్‌లను తొలగించేశారు. దీంతో ఆందోళన చెందిన వారు సిఎం చేసిన ప్రకటన ప్రస్తావించినప్పటికీ తమకు ఎటువంటి ఆదేశాలు అందలేదని, బిల్లులు చెల్లించాల్సిందేనని హెచ్చరించడంతో అదనపు ఛార్జీలను చెల్లించి సర్వీస్‌లను తిరిగి పునరుద్ధరించుకోవాల్సిన దుస్థితి ఏర్పడింది. గ్రామీణులు సిఎం, ఎమ్మెల్యేలు, అధికారులను తిడుతున్నారు.

# రేషన్ సరుకుల పంపిణీకి చర్యలు!

## అయితే కాస్త ఆలస్యం

సమైక్యాంధ్ర ఆందోళన కారణంగా ఈ నెలలో నిలిచిపోయిన అమ్మహస్తం సరుకులను రేషన్ షాపులకు సరఫరా చేసేందుకు అధికారులు చర్యలు చేపట్టారు. పౌరసరఫరాల శాఖ, రెవిన్యూ శాఖ ఉద్యోగులు సకల జనుల సమ్మెలో వున్న కారణంగా గోదాముల నుండి రేషన్ సరుకులు దుకాణాలకు సరఫరా నిలిచిపోయాయి. సరుకుల పంపిణీ నిలిచిపోవడంతో వీటిపై ఆధారపడిన వారు ఇబ్బందులు పడుతున్నారు. సరుకులు గోదాముల్లో నిల్వలు పేరుకుపోయి పాడైపోయే అవకాశం వుండడంతో వెంటనే రేషన్ షాపులకు సరఫరా చేయాలని ప్రభుత్వం ఆదేశించడంతో పౌరసరఫరాల శాఖాధికారులు స్పందించక తప్పలేదు. రేషన్ షాపు డీలర్ల నుండి డిడిలు స్వీకరించి అవసరమైన సరుకులు వెంటనే తరలించాలని కలెక్టర్ ఆదేశించారు. పట్టణ ప్రాంతాలతోపాటు గ్రామీణ ప్రాంతాలకు చెందిన లబ్దిదారులు "అమ్మహస్తం" సరుకుల కోసం ఎదురు చూస్తున్నారు. మండల తహశీల్దార్ కార్యాలయంలో డీలర్ల నుండి డిడిలు తీసుకునేందుకు ఒక ఉద్యోగిని ఏర్పాటు చేశారు. డిడిలు తీసుకున్న ఉద్యోగి వెంటనే పౌరసరఫరాల కార్యాలయానికి సమాచారం అందించి గోదాముల నుండి సరుకుల పంపిణీకి అధికారుల నుండి అనుమతి పొందుతున్నారు. సమైక్యాంధ్ర ఆందోళనల పుణ్యమా అంటూ పది రోజులు ఆలస్యంగా రేషన్ సరుకులు తీసుకోవాలి.

## కాంగ్రెస్‌వాదుల కొత్త పార్టీ!

మొదటి పేజీ కొరవ

తన పార్టీని నడిపించాడు. దానితో తెలంగాణ మొత్తం మీద వైఎస్ఆర్ కాంగ్రెస్ ఆనవాళ్లు కూడా లేని దుర్గతి దాపురించింది. జగన్ కోసం ప్రాణ త్యాగానికి సిద్ధమన్నట్లు వుండిన కొండా సురేఖ కూడా అదే జగన్‌ను బండబూతులు తిట్టి పార్టీ మారిపోయారు. తెలంగాణలో కీలకమనుకొన్న నేత లందరూ పార్టీ వదలిపెట్టి వెళ్లిపోయారు. ఒక్క ప్రక టనతో ఒక రాజకీయ పార్టీ జాతకం తారుమారై పోయింది.

అయితే ఆంధ్ర ప్రాంతంలో సమైక్య నినా దాన్ని మనస్ఫూర్తిగా పల్లవిస్తున్న పార్టీ వైఎస్ఆర్ కాంగ్రెస్ ఒక్కటే కావడం గమనార్హం. దీనివల్ల ఈ ప్రాంతంలో వారికి అపూర్వమైన ప్రజాదరణ లభిం చాలి. ఆ సూచనలున్నాయి కూడా. అయితే రాజకీ యాలు విచిత్రమైనవి. ఒక పార్టీ మీద ఎంత అభి మానం వున్నా, ఓటరు మనస్తత్వం గెలుపు గుర్రం మీద ఎక్కాలనే ధోరణిలో వుంటుంది. ఆంధ్ర, రాయలసీమ మొత్తంలో జగన్‌కు ప్రజాదరణ లభిం చినా, 119 సీట్లున్న తెలంగాణలో ఓటు పడనప్పుడు అధికారంలోకి రావడం ఎట్లా సాధ్యం అన్న ప్రశ్న ఆ పార్టీ అనుకూల ఓటరును ఆలోచనలో పడవేస్తు న్నది. జగన్ ఆశల పడవను నడి సముద్రంలో ముంచివేసే పరిణామం ఇది. రాజకీయాలకు అదృ ష్టంతోపాటు కొంత అనుభవం కూడా కావాలనే నిజాన్ని ఆలస్యంగా అర్థం చేసుకొన్నాడు జగన్.

ఈ పరిస్థితులలో అటు తెలంగాణలోను, ఇటు ఆంధ్రలోను తన జాతకం మెరుగు పడుతుం దనే నమ్మకంతో వున్న వాడు ఒక్క చంద్రబాబు మాత్రమే. తెలంగాణ పట్ల ఆయన స్థిర వైఖరితో వ్యవహరించాడు. రాష్ట్ర విభజనకు అనుకూలంగా తన పార్టీ లేఖ ఇచ్చింది కాబట్టి, ఆ నిర్ణయాన్ని విభే దించనని తాను కలవడానికి వచ్చిన ఏపిఎన్జీఓలతో కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పాడాయన. తెలంగాణ వారికి హైదరాబాద్ కేటాయింపు జరిగినా, ఆంధ్రకు దానికి మించిన కొత్త రాజధాని నిర్మిస్తానని కూడా అన్నాడు. అంత స్పష్టంగా విభజన సానుకూల వైఖరి అవలంబించి కూడా ఆంధ్ర ప్రాంతంలో పర్యటించే సాహసం చేసిన ఏకైక నేత కూడా చంద్రబాబు ఒక్కడే కావడం గమనార్హం. కాంగ్రెస్ మీద ద్వేషం, జగన్ అధికారంలోకి రాలేడన్న నిరాశతో వున్న ఓటరు, వారిద్దరికీ ప్రత్యామ్నాయంగా తననే అక్కున చేర్చుకొంటారన్నది చంద్రబాబు ఆశ.

### కాంగ్రెస్‌వాదులలో కలత

ఈ పరిణామాలు కాంగ్రెస్‌వాదులను కలతకు గురి చేశాయి. ఆంధ్ర, రాయలసీమ ప్రాంతానికి చెం దిన కాంగ్రెస్‌వాదులందరిలో తమ రాజకీయ భవి ష్యత్తు మీద ఆశలు అంతరించిపోయాయి. కాంగ్రెస్ కొంప కొల్లేరు అన్న భావన ప్రబలిపోతున్నది. వారికి మిగిలివున్న ఒకే ఒక అవకాశం – జగన్ పార్టీలో చోటు దొరుకుతుందేమో అని వెతుక్కోవడం. చాలా మంది ఆ ప్రయత్నాలలో పడ్డారు కానీ, దురదృష్టవ శాత్తు వారికి అక్కడ నో వేకెన్సీ బోర్డు వెక్కిరిస్తున్నది. ఏ సీటు కూడా ఖాళీ లేదు. ఒక్క కర్నూలు జిల్లా నుంచే మంత్రులు ఏరాసు ప్రతాప్‌రెడ్డి, టిజివెంక టేష్, ఎమ్మీ ఎస్వీవై రెడ్డి, మరొక నేత శిల్పా మోహన్‌రెడ్డి జగన్ పార్టీలో ప్రవేశానికి దరఖాస్తు చేశారట. అయితే వీరిలో ఒక్క శిల్పా మోహన్‌రెడ్డికి తప్ప మరెవ్వరికీ హామీ లభించలేదని తెలుస్తున్నది. ప్రతి జిల్లాలోనూ దాదాపు ఇదే పరిస్థితి. రెండేళ్ల క్రితం నుంచే జగన్ తన పార్టీని ఎన్నికలకు సన్నద్ధం చేయాలనే ప్రయత్నంలో వుండడం వల్ల ప్రతి అసెంబ్లీ నియోజకవర్గానికి ఎవరో ఒక అభ్యర్థి నిర్ణ యమైపోయి వున్నాడక్కడ. కొన్ని ఎమ్మీ స్థానాలు మాత్రమే ఖాళీగా మిగిలాయి.

### కొత్త పార్టీకి ఆలోచన

దీనితో తమకు తామే కొత్త పార్టీ పెట్టుకొంటే ఎట్లా వుంటుందనే ఆలోచన కాంగ్రెస్‌వాదులలో మొగ్గ తొడిగింది. ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి వైఖరి అందుకు అనుకూలంగా కన్పించడం గమ నార్హం. రాష్ట్ర విభజన విషయంలో అధిష్టానాన్ని ధైర్యంగా ధిక్కరించిన కిరణ్‌కుమార్‌రెడ్డి, సోనియా హూంకరింపు తర్వాత కూడా తన వైఖరి మార్చుకో లేదు. విభజన తీర్మానం శాసనసభ ఆమోదం కోసం వచ్చినప్పుడు తన తడాఖా చూపాలన్న యోచనలో వున్నాడాయన. శాసనసభలో దీనిపై చర్చ జరిపించి, అందులో తాను తనను అనుసరించే మంత్రులం దరూ విభజనకు వ్యతిరేకంగా వ్యవహరించి, తీర్మా నాన్ని ఓడించి, ఒక హీరో వలె కాంగ్రెస్ నుంచి తప్పుకోవాలన్నది ముఖ్యమంత్రి ప్రణాళిక అని చెప్తున్నారు. దానివల్ల సీమాంధ్ర ప్రాంతంలో తనకు ఎక్కడలేని నాయకత్వ గుర్తింపు లభిస్తుందని, దాని ఆధారంగా కొత్త పార్టీ పెట్టి ఎన్నికలకు వెళ్తే కాంగ్రెస్ ఓటు బ్యాంకు సమస్తం తనకే దక్కుతుందని పథకం రచిస్తున్నాడాయన. మహీధర్‌రెడ్డి, వట్టి వసంత కుమార్, గంటా శ్రీనివాసరావు వంటి మంత్రులు, చాలామంది ఎమ్మెల్యేలు కిరణ్ పథకాన్ని సమర్థిస్తు న్నారు. ఆ మార్గంలో నడవడానికి సన్నద్ధులౌతు న్నారు. ఏపిఎన్జీఓ అధ్యక్షుడు అశోక్‌బాబును ఇందు కోసం ఒక పావు వలె వాడుతున్నాడు ముఖ్యమంత్రి. ప్రజలలో కాంగ్రెస్ పట్ల ద్వేషం మరింత పెంచే ప్రచారాన్ని ఎన్జీఓ సంఘం ద్వారా నడిపిస్తున్నాడు.

అయితే కేవలం విభజన అడ్డుకొన్నారన్న ఒకే ఒక కారణంతో రాష్ట్ర ప్రజలు ఒక వర్గం నేతలను ఆదరిస్తారా అన్నది ప్రశ్న. రేపటి ఎన్నికలలో ఇదొక ప్రధాన అంశంగా వుంటుందన్నది నిజమే కానీ, అదొక్కటే ఫలితాన్ని నిర్దేశిస్తుందనే భావన మాత్రం సహేతుకం కాదు. ఎన్నికలలో ఓటరును పలు రకాల అంశాలు ప్రభావితం చేస్తాయి. పైగా తాము ఓటు వేసే పార్టీ నేత సమర్థత పట్ల, నాయకత్వ పటిమ పట్ల ఓటరులో బలమైన విశ్వాసం కావాలి. కిరణ్‌కుమార్‌రెడ్డిలో ఆ స్థాయి లేదన్నది నిజం. ఎటూ మునిగిపోయే పడవ కాబట్టి, గడ్డిపోచ దొరికినా గట్టిగా పట్టుకొని గోదావరి ఈదాలనే తత్వం ఒక్కటే వారిని కొత్త పార్టీ ఆలోచన వైపు నడిపిస్తున్నది.



నెల్లూరు లయన్స్ క్లబ్ ఆధ్వర్యంలో ఉపాధ్యాయులకు విలువల ఆధారిత విద్యపై జరిగిన శిక్షణా శిబిరంలో ప్రసంగిస్తున్న నెల్లూరు వేదాయపాళెంలోని మైథిలి ఇంగ్లీషు మీడియం స్కూల్ కరస్పాండెంట్ మనోహర్‌రెడ్డి. చిత్రంలో లయన్స్ క్లబ్ వైస్ గవర్నర్ అమృతవల్లి, మాజీ గవర్నర్ శ్రీనివాసరావు, డాక్టర్ రవిశంకర్ తదితరులు.

## నెల్లూరుముచ్చట్లు

3వ పేజీ కొరవ

తగదన్నారు. ఈ నీటి తరలింపు మూలంగా నెల్లూరు జిల్లాలోని డెల్టా ప్రాంతం ఎడారిగా మారుతుంద న్నారు. ఈ తప్పుడు జిఓను తక్షణం ఉపసంహరించు కోవాలని రాజగోపాల్ డిమాండ్ చేశారు. ఈ సమావే శంలో పార్టీ నాయకులు వెంకమరాజా, చంద్రమౌళి, గంగపట్నం రమణయ్య తదితరులు పాల్గొన్నారు.

## స్తంభించిన రవాణా

జిల్లాలో ఆర్టీసి బస్సుల రాకపోకలు పూర్తిగా స్తంభించి పోయాయి. సమైక్యాంధ్రకు మద్దతుగా ఎన్ఎంయూ, ఎంప్లాయిస్ యూనియన్, టిఎంఎస్‌లు మొదటి నుంచి బంద్ పాటిస్తుండగా ఎస్‌డబ్ల్యుఎఫ్ మాత్రం దూరంగా వుంటూ బస్సులు నడుపుతు న్నారు. ఉద్యమ ఉధృతికి తలొగ్గిన వాళ్లు ఇక నుంచి ఉద్యమంలో పాల్గొంటున్నట్లు ప్రకటించడంతో ఆర్టీసి బస్సుల రాకపోకలు పూర్తిగా నిలిచిపోయాయి. వివిధ గ్రామాల నుంచి పట్టణాలకు రాకపోకలు సాగించే వాళ్లు బస్సులు లేక తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటు న్నారు.

## సవరణ

గతవారం 'జమీన్‌రైతు' పత్రిక తొమ్మిదో పేజీలో ప్రచురించిన పెళ్లిళ్ల ఫోటోల్లో డాక్టర్ జెట్టి ప్రమోద్‌రెడ్డి కుమార్తె మేఘన ఫోటో క్రింద పొరపాటుగా డాక్టర్ జెట్టి శేషారెడ్డి కుమార్తె మేఘన అని ప్రచురితమైంది. తప్పుకు క్షంతవ్యులం.

## గణపతి చేతికి సమైక్యాంధ్ర జెండా!

నగరంలో వివిధ కూడళ్లలో ఏర్పాటుచేసిన గణపతి విగ్రహాల వద్ద సమైక్య నినాదం విన్పిం చింది. వినాయకుడి చేతుల్లో సమైక్యాంధ్ర జెండా లను వుంచి అటు భక్తిని చాటడంతోపాటు ఇటు తమ సమైక్య వాదాన్ని విన్పించారు. మట్టి విగ్రహా లను తయారుచేసిన వాళ్లు అందులోనే సమైక్య జెం డాను మట్టితోనే రూపొందించడం విశేషం.

## స్వాతంత్ర్య సమరయోధుడు రాధాకృష్ణమూర్తి మృతి



స్వాతంత్ర సమర యోధుడు, రూరల్ మం డలం నరుకూరు గ్రామానికి చెందిన మహంకాళి రాధా కృష్ణమూర్తి(92) సెప్టెంబర్ 3న మరణించారు. బ్రిటీష్ పాలకులకు వ్యతిరేకంగా పోరాడిన ఆయన స్వాతంత్ర్యానంతరం పౌరోహి త్యాన్ని వృత్తిగా చేపట్టి మండలంలోని పలు గ్రామాల ప్రజల అభిమానాన్ని చూరగొన్నారు. జీవ కారుణ్యం మెండుగాగల ఆయన గోవుల సంరక్షణకు తన వంతు కృషి చేశారు.

## జనవాణి

2వ పేజీ కొరవ

లతో ఏజంట్లు నమ్మబలికించారు. మూడు సంవత్స రాలకు కాస్త ఇబ్బంది అంటూ ఐదేళ్ల తర్వాత 50వేల రూపాయలు కట్టిన వారికి వెయ్యి రూపాయలు కూడా రాలేదు. ఇలాంటి పాలసీలతో జనాన్ని మోసం చేయడం 29కోట్లకుపైగా పాలసీలు, 15లక్షల కోట్లకు పైగా ఆస్తులున్న లైఫ్ ఇన్సూరెన్స్ కార్పొరేషన్ ఆఫ్ ఇండియా సంస్థకు తగనుగాక తగదు. ఈ పాలసీదా రులందరినీ ఎల్ఐసి ఆదుకోకుంటే ఆ సంస్థ ప్రజల్లో తనకున్న విశ్వసనీయతను పోగొట్టుకోవడం ఖాయం.

ఆనం సుధాకర్‌రావు — గూడలి

### తపాలాశాఖ దివాలాకోరుతనం!

వెర్రి వేయి విధాలు. వేలం వెర్రి అన్నట్లు దేశం లోని ప్రభుత్వాలు నడుస్తున్నాయి. షేర్షాకాలం నుండి అంచెలంచెలుగా ఎదిగిన భారత తపాలాశాఖ ప్రపంచ ప్రసిద్ధిగాంచింది. అర్థ రూపాయికి కార్డు కొని వ్రాసి పోస్టు చేస్తే దేశంలోని కుగ్రామానికి చేరేది. ఇటీవల 137ఏళ్ల చరిత్ర కలిగిన టెలిగ్రామ్‌ను అంత మొందించారు. కొత్తగా ఎంతో చరిత్ర కల్గిన పోస్టల్ స్టాంపుల కోసం 300 రూపాయలు కడితే 60 రూపాయల విలువ చేసే వారు కోరిన ఫోటో కలి గిన స్టాంప్ ఇస్తారట. పోస్టల్ స్టాంపుపై ఉండే మహ నీయుల ఫోటోకు ఎంతో విలువ వుండేది. అటువం టిది 300 రూపాయలు కడితే వెధవాయిల బొమ్మ లతో స్టాంపులు విడుదల చేస్తామన్న నిర్ణయాన్ని పోస్టల్ శాఖ తక్షణం ఉపసంహరించుకో మనవి.

వాస్తు రామచంద్ర — నెల్లూరు

### కేంద్రం తప్పటడుగులు!

గత నాలుగేళ్లుగా ఆంధ్రప్రదేశ్‌ను అల్లకల్లో లం చేస్తున్న తెలంగాణ విభజన అంశంపై కేంద్ర ప్రభుత్వం సరైన పరిష్కార దిశలో అడుగులు వేయ డం లేదు. ఎన్నో కమిటీలు, సమావేశాల రూపంలో కాలహరణం చేసి జూలై 30తేది తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు చేస్తున్నట్లు యూపిఏ ప్రభుత్వం ప్రకటిం చింది. ఈ ప్రకటన రాగానే సీమాంధ్ర భగ్గుమన్నది. గతమాసం రోజులుగా సీమాంధ్రలో ఎవరి మద్దతు లేకుండా జరుగుతున్న ప్రజాందోళనలు చూసి కూడా కేంద్రం తలతిక్కగా వ్యవహరిస్తోంది. ఒకవైపు తెలంగాణపై వెనుకడుగు వేయమంటూనే హైదరా బాద్ నగరం వ్యవహారం తేల్చను పిల్లిమొగ్గలు వేస్తోంది. ఆంటోనీ కమిటీ ఏమి చేస్తుందో అర్థం కావడం లేదు. మరోవైపు పార్లమెంటరీ కమిటీని సీమాంధ్ర కేంద్రమంత్రులు అభ్యర్థించారు. సంయ మనం పాటించాల్సిన ఈ సమయంలో తెలుగు దేశం, వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీలు ఓటు బ్యాంకు రాజకీయాలకు నడుం కట్టాయి. ఇప్పటికైనా కేంద్ర ప్రభుత్వం స్పందించాలి. ఈ వ్యవహారంలో ప్రజా భీష్టం మేరకు నడవాలి.

బలరామ్ — నెల్లూరు

## పదరంగం -84

నిర్వహణ : బాబాజీ

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | 3 | | | 4 | 5 | 6 |
| | | 7 | 8 | | 9 | 10 | | 11 | |
| 12 | 13 | | 14 | | | | | | |
| 15 | | | | | | 16 | 17 | 18 | |
| | 19 | 20 | | 21 | | | 22 | | |
| 23 | | 24 | | | | 25 | | | |
| 26 | 27 | | | 28 | 29 | | | | |
| | 30 | | | | 31 | | | | 32 |
| 33 | | | | 34 | | | 35 | 36 | |
| | | | 37 | | | 38 | | | |

**అడ్డం**

1. అన్నీ, సమస్తం (3)
4. ప్రతిభావంతునికి ఉండేది (3)
7. నజ భజ జజర గణాలు గల పద్య వృత్తము (5)
11. నారాయణలో గల పీచు (2)
12. పాపం చేసినవాడినే మంటారు? (2)
14. అటుపిమ్మట, తరువాత (4)
15. అటునుంచి శరీరం (2)
16. పంచపాండవులలో నాల్గవవాడు (4)
19. సోదమ్మ చెప్పేది (2)
21. తెలుగు వర్క్ (2)
22. తలతెగిన అణువు (2)
24. నటీనటులు చేసేవి (3)
25. తప్పొప్పుల మార్పు (4)
26. కినుక (3)
28. ఎవరైన ఉచితంగా ఇవ్వకల్గినది (3)
30. పెండ్లి కుమారుడు (3)
31. నాశనం, క్షీణించడం (2)
33. దొంగ (3)
34. తెలుగు యాంగిల్ (2)
35. పాకడం (3)
37. తెలుగు గానా (2)
38. అర్థం చేసుకోవడం (4)

**నిలువు**

1. తెలుగు ఫెసిలిటి (4)
2. అమ్యామ్యా (2)
3. మొసలి (3)
5. క్రిందనుంచి స్త్రీ, నారి (2)
6. దశరథుని మూడో కొడుకు (4)
8. తెలుగు డిసిగ్నేషన్ (3)
9. తమిళ ఆంటీ (2)
10. స్త్రీ (3)
13. ప్రఖ్యాత పాశ్చాత్య చిత్రకారుడు (3)
17. క్రిందనుంచి దడ (3)
18. ధృతరాష్ట్రుని కుమారులు క్రింద నుంచి (4)
20. సూర్యుడు (5)
21. జాక్‌ఫ్రూట్ (3)
23. క్రింద నుంచి పెద్ద సోదరుడు (2)
25. తెలుగు హెల్ప్ (3)
27. ఇంగ్లీషు ప్రేమికుడు (3)
29. గుణం, స్వభావం (3)
32. పట్టుకాదు, విడవడం (3)
33. స్థలం (2)
34. తెలుగు క్యాజిల్ (2)
35. తాటాకుల ఇల్లు, గుడిసె (2)
36. క్రిందనుంచి ఇంగ్లీషు బంధం (2)

**సమాధానాలు**

## పదరంగం -83

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 బ | 2 యా | నా | | 3 గం | 4 ప | | 5 వా | స | 6 న |
| 7 లి | మి | | 8 ర | జి | తం | | రి | | గ |
| 9 మి | ని | 10 మం | | | 11 గి | 12 రి | జ | 13 ను | లు |
| | | 14 త | 15 రు | ణి | | వా | | దు | |
| 16 నం | 17 గ | నా | చి | | 18 రా | జు | 19 గా | రు | |
| 20 పే | లా | లు | | 21 వా | ణి | | ను | | 22 బా |
| | టా | | 23 నే | ల | | 24 ప | గ | 25 వా | డు |
| 26 లో | | 27 గ | త | ము | | య | | 28 మ | గ |
| 29 కం | 30 టి | పా | ప | | | 31 నం | 32 త | ప | |
| 33 లో | న | | 34 ని | రు | డు | | 35 మో | క్షం | |

# సంక్షిప్త సింహపురి

## చాకిరేవు

తెలుగు జాతిని నిట్టనిలువునా చీల్చే కాంగ్రెస్ పార్టీ కుట్రపూరిత వ్యవహారాలు ఇక చెల్లవని రజక సమాఖ్య జిల్లా అధ్యక్షులు వింజమూరు మస్తాన్ బాబు విమర్శించారు. నెల్లూరులో విలేకరులతో మాట్లాడుతూ రాష్ట్ర విభజనను అడ్డుకోవడానికి రాజకీయ పార్టీల నేతలు ఉద్యమంలోకి రాకపోవడాన్ని తప్పుపట్టారు. ఎన్జీఓలు, విద్యార్థులే ఈ ఉద్యమానికి ఊపిరి పోస్తున్నారని చెప్పారు. వారికి జిల్లా రజక సమాఖ్య తరపున సంపూర్ణ మద్దతుగా ఎమ్మెల్యే, ఎమ్మెల్సీ, మంత్రుల కుటుంబాల బట్టలు ఉతకడాన్ని మానుతామన్నారు. ఆంటోని కమిటీ సీమాంధ్రకు వస్తే మాసిన గుడ్డలతోనే ఢిల్లీకి తిరిగి వెళ్లాల్సి వస్తుందని, వారు ఏ అతిథి గృహంలో బసచేసినా తమ సామాజిక వర్గం వారు బట్టలు ఉతకరన్నారు. దీనిలో భాగంగానే 9వ తేది ప్రజాప్రతినిధుల ఇళ్ల ముందు చాకిరేవును పెట్టామన్నారు.

## ఇన్సాఫ్ కమిటీ



నెల్లూరు రైల్వేఫీడర్స్ రోడ్డులోని జిల్లా సిపిఐ కార్యాలయంలో సిపిఐలో ముస్లింల అనుబంధ విభాగమైన ఇన్సాఫ్ నగర కమిటీ ఎన్నిక జరిగింది. సిపిఐ జిల్లా కార్యదర్శి వి.రామరాజు అధ్యక్షతన జరిగిన ఈ కమిటీ ఎన్నికలో అధ్యక్షుడిగా షేక్ రియాజ్, ఉపాధ్యక్షులుగా ఖాదర్‌బాష, సత్తార్, కార్యదర్శిగా మహమ్మద్ రవూఫ్‌ను ఎన్నుకోవడం జరిగింది. ఈ సందర్భంగా రామరాజు మాట్లాడుతూ నూతన కమిటీ శక్తివంచన లేకుండా పనిచేసి అన్ని డివిజన్లలో పార్టీ శాఖలు ఏర్పాటు చేయాలని సూచించారు. ఈ కార్యక్రమంలో పార్టీ నగర కన్వీనర్ షేక్ మునీర్, ఎఐ వైఎఫ్ జిల్లా కార్యదర్శి లీలామోహన్, జిల్లా సమితి సభ్యులు అహ్మద్‌బాషా, గోపాల్, అన్వర్ తదితరులు పాల్గొన్నారు.

## విశ్రాంత పోలీసు అధికార్ల ర్యాలీ!

సమైక్యాంధ్ర ఉద్యమానికి మద్దతుగా విశ్రాంత పోలీసు అధికారుల సంఘం నేతృత్వంలో పోలీసాఫీసు నుంచి విఆర్‌సి వరకు భారీ ర్యాలీ నిర్వహించారు. అనంతరం రాజ్యాంగ నిర్మాత బి.ఆర్.అంబేద్కర్ విగ్రహానికి పుష్పమాలవేసి మాజీ డిఐజి బాలకొండయ్య మాట్లాడారు. రాష్ట్రాన్ని విభజిస్తే అభివృద్ధి కుంటుపడుతుందన్నారు. విభజిస్తున్నారని తెలిసి కూడా రాష్ట్రానికి చెందిన కేంద్ర మంత్రులు మౌనంగా వుండడంలో ఆంతర్యం ఏమిటో అర్థం కావడం లేదన్నారు. సిడబ్ల్యుసిలో తీసుకున్న విభజన నిర్ణయాన్ని వెనక్కు తీసుకోవాలన్నారు. విభజన నిర్ణయాన్ని విరమించుకొనే వరకు తమ సంఘం వివిధ రూపాల్లో ఉద్యమిస్తూనే ఉంటుందన్నారు. విశ్రాంత పోలీసు అధికారులు రాధ, శ్రీహరిరావు, ఎల్.ప్రభాకర్‌రావు తదితరులు ఈ ర్యాలీలో పాల్గొన్నారు.

## సర్వేపల్లి రాధాకృష్ణన్ 125వ జయంతి!



మహా ఉపాధ్యాయ సర్వేపల్లి రాధాకృష్ణన్ 125వ జయంతిని పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ ఘనంగా నిర్వహించింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన నెల్లూరు సిటీ ఎమ్మెల్యే ముంగమూరు శ్రీధర్‌కృష్ణారెడ్డి మాట్లాడుతూ ఇలలోన గురువొక్కరే ప్రాణమున్నదైవమన్నారు. అనంతరం ఉత్తమ ఉపాధ్యాయ అవార్డు గ్రహీతలు కర్ణాటి శ్రీనివాసులు(నెల్లూరు), పంచాగ్నుల విశ్వేశ్వరశర్మ(నెల్లూరు), సి.వేణుమాధవ్(ఆదిశంకర ఇంజనీరింగ్ కాలేజి), చీదరాల చెన్నయ్య(బుచ్చి), ఎస్వీ సుబ్బయ్య(బుచ్చి), కొప్పు శ్రీనివాసులు(అల్లూరు), కె.రవిశంకర్(గొలగమూడి), రాయపూడి శరత్‌బాబు(బుచ్చి), పల్లెబోయిన మురళీకృష్ణ (నెల్లూరు), ఎమ్.భాస్కర్‌రావు(నెల్లూరు)లను ఘనంగా సత్కరించారు. ఈ కార్యక్రమంలో ఆచార్య ఆదిత్య, సర్వేపల్లి రామ్మూర్తి, పినాకినీ యూత్ వెల్ఫేర్ అసోసియేషన్ అధ్యక్షుడు కె.మురళీమోహన్‌రాజు తదితరులు పాల్గొన్నారు.

## సర్వమత ప్రార్థనలు



డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి నాల్గవ వర్ధంతిని పురస్కరించుకొని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ పార్టీ నగర అసెంబ్లీ నియోజకవర్గ సమన్వయకర్త డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్ నేతృత్వంలో గాంధీబొమ్మ వద్దగల వైఎస్ రాజశేఖర్‌రెడ్డి విగ్రహం వద్ద సర్వమత ప్రార్థనలు నిర్వహించారు. ఈ సందర్భంగా కాకాణి గోవర్ధన్‌రెడ్డి మాట్లాడుతూ డాక్టర్ వైఎస్ రాజశేఖర్‌రెడ్డి లేనిలోటు ఈ రాష్ట్రంలో స్పష్టంగా కనిపిస్తుందని, ఆ మహానేత లేకపోవడం వల్లనే ఈ రోజు రాష్ట్రాన్ని అడ్డంగా చీల్చేదానికి సోనియా గాంధీ పూనుకొన్నాదన్నారు. డాక్టర్ అనిల్‌కుమార్ యాదవ్ మాట్లాడుతూ వైఎస్‌రాజశేఖర్‌రెడ్డి భౌతికంగా మరణించినప్పటికీ ప్రతి తెలుగు వారి గుండె చప్పుళ్లలో బతికే ఉన్నారన్నారు. ఈ కార్యక్రమంలో ముక్కాల ద్వారకనాథ్, వెంకటేశ్వరరెడ్డి, దొడ్ల వెంకటేశ్వర్లు, ముప్పసాని శ్రీనివాసులు, ఫయాజ్, ఎస్‌కె హాజీ తదితరులు పాల్గొన్నారు.



రైతు లోకం

# చౌడు నేలలు - యాజమాన్యం!

చౌడు నేలలు ప్రధానంగా రెండు రకాలు. తెల్ల(పాల) చౌడు మరియు నల్ల (కారు) చౌడు.

### తెల్లచౌడు నేలలు

వేసవికాలంలో కొన్ని నేలల ఉపరితలంపైన తెల్లటి చౌడు పేరుకొని వుంటుంది. ఈ సమస్యను అధిగమించేందుకు భూమిపై పేరుకొన్న చౌడును పారతో చెక్కి తీసివేయాలి. పొలాన్ని మొదట బాగా దున్ని సౌలభ్యాన్ని బట్టి చిన్న మడులుగా చేసుకోవాలి. ప్రతి మడిలో సుమారు 20 సెంటీమీటర్ల లోతు నీరు నిల్వ వుండేటట్లు సాగు నీటిని పెట్టాలి. ఈ నీటిని మడిలో నాలుగు లేక ఐదు రోజులు నిల్వ వుంచి భూమిలో ఇంకనివ్వాలి. తరువాత మురుగునీటిని కాలువల ద్వారా తీసివేయాలి. ఈ విధంగా 3 – 4 సార్లు చేస్తే చౌడు తీవ్రత చాలావరకు తగ్గుతుంది. మెట్ట ప్రాంతాల్లో బోదెలు, సాళ్ళు నిర్మించి సాళ్ల మధ్యలో విత్తాలి. బోదె మధ్యలో విత్తరాదు. పశువుల ఎరువు, కంపోస్టు మరియు పచ్చిరొట్ట ఎరువులు వాడాలి.

డాక్టర్ కె.పుల్లంరాజు
కోఆర్డినేటర్,
ఏరువాక (డాట్ సెంటర్), నెల్లూరు.

### కారు చౌడు నేలలు

ఈ భూమిలో నీరు త్వరగా భూమిలోకి ఇంకదు. ఎండినప్పుడు నేల చాలా గట్టిగా వుంటుంది. ఈ నేలలను బాగుచేయడానికి జిప్సంను వేయాల్సి వుంటుంది. ఎకరాకు 1.2 నుంచి 1.6 టన్నుల జిప్సం అవసరమౌతుంది. జిప్సంను నేలపై చల్లి మట్టిలో కలిసేలా పైపైన గొర్రుతో దున్నాలి. మొత్తం జిప్సంను ఒకే దఫా వేయాలి. తరువాత నీటిని నిల్వకట్టి నేలలో ఇంకేలా చేయాలి. వారం రోజులు వరుసగా నీటిని మడిలో నిల్వ వుంచాలి. మురుగునీటిని కాలువల ద్వారా బయటకు పంపాలి. చెరకు ఫ్యాక్టరీలలో వ్యర్థ పదార్థంగా మిగిలే ప్రెస్ మడ్‌ను కూడా జిప్సంకు బదులుగా వాడవచ్చు. ఎకరాకు 1.2 నుండి 1.6 టన్నులు వేయాలి.

తెల్ల చౌడు ఒక మోస్తరుగా వుంటే, జీలుగను పెంచి మట్టిలో కలియ దున్నితే చౌడు ప్రభావం తగ్గుతుంది.



Regn.No. : RN 1156 / 57 J/Nellore/008/12-14

# ధృతరాష్ట్రుని ధోరణిలో కేంద్రం!

- సీమాంధ్రలో మహోధృత ప్రజా నిరసన వెల్లువెత్తుతున్నా కేంద్రం చూసీచూడనట్లుంది.
- సమైక్యాంధ్ర కావాలంటున్న అన్ని వర్గాల ప్రజలు.
- హైదరాబాద్ నగరమే పీటముడి.
- ఉద్యోగుల సమ్మెకు సిఎం మద్దతు.
- రాష్ట్రం కోలుకోలేని విధంగా నష్టపోనున్నది.



ఉపాధ్యాయ దినోత్సవం సందర్భంగా హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో రాష్ట్ర ప్రభుత్వం నేతృత్వంలో జరిగిన ఉత్తమ ఉపాధ్యాయ అవార్డుల ప్రదానోత్సవంలో మన జిల్లాకు సంబంధించి అవార్డును విద్యాశాఖామంత్రి పార్థసారథి చేతుల మీదుగా అందుకొంటున్న అల్లూరు రామకృష్ణ జూనియర్ కళాశాలలోని సంస్కృత ఉపన్యాసకుడు, శతావధాని కోట రాజశేఖర్.

కాకులు అరుస్తూ వుంటాయి, కరవాడు ఎండుతూ వుంటుందన్నట్లుంది కేంద్ర ప్రభుత్వ వైఖరి. తెలంగాణ విభజనకు వ్యతిరేకంగా ఆంధ్ర, రాయలసీమ ప్రాంతంలో మహోధృత ప్రజా నిరసనకు వెల్లువెత్తుతున్నా కేంద్ర నాయకత్వం మాత్రం అది తమ దృష్టికి రానట్లే, తమను ప్రభావితం చేయనట్లే వ్యవహరిస్తున్నది. రాష్ట్రంలో జరిగే ఉద్యమాల గురించి మాకు పూర్తి సమాచారం వుంది, కానీ తెలంగాణ ప్రక్రియ మాత్రం ముందుకే కొనసాగుతుంది అని ప్రకటించాడు కేంద్ర హోం మంత్రి సుశీల్‌కుమార్ షిండే. ఆయన ప్రకటనకు తగినట్లుగానే హోం మంత్రిత్వ శాఖ తెలంగాణపై క్యాబినెట్ నోట్ తయారు చేసి, న్యాయ పరిశీలనకు పంపింది. వైద్య సలహా కోసం అమెరికా వెళ్లి ఉన్న సోనియా గాంధీ తిరిగి వచ్చే సమయానికి క్యాబినెట్ నోట్ రూపకల్పన పూర్తిచేసి, మంత్రివర్గ సమావేశం ముందు ప్రతిపాదించాలనే లక్ష్యంతో పని చేస్తున్నారు హోం మంత్రిత్వ శాఖ అధికారులు. వారి ధోరణి చూస్తుంటే, వచ్చే శీతాకాల సమావేశాలలో పార్లమెంటు ముందు తెలంగాణ బిల్లు ప్రవేశ పెట్టడం ఖాయం అన్పిస్తున్నది.

## వీధుల్లోకి జనం

ఈ వార్తలు ఏపీ ఆంధ్రలో జరుగుతున్న నిరసనోద్యమాన్ని ప్రభావితం చేయడం లేదు. రోజు రోజుకు మరింత అధిక సంఖ్యలో జనం వీధులలోకి వస్తున్నారు. ప్రభుత్వ ఉద్యోగులతో మొదలైన ఈ పరంపర ఇప్పుడు సమాజంలోని అన్ని వర్గాలకూ వ్యాపించింది. వ్యాపారులు, డాక్టర్లు, న్యాయవాదులు, వివిధ కుల సంఘాలు, ఉపాధ్యాయులు, సాధారణ ప్రజలు కూడా ఉద్యమంలో చురుకుగా పాల్గొంటున్నారు. రాజకీయాలతో సంబంధం లేకుండా, ఎవరి నాయకత్వమూ లేకుండా, ఒకరి నుంచి పిలుపు ఆశించకుండా ఉద్యమం నడిచి పోతున్నది. మొదట పట్టణాలకు పరిమితమైనది కాస్తా ఇప్పుడు పల్లెలకూ ప్రాకింది. తెలంగాణ ఏర్పడితే హైదరాబాద్ వేరై పోతుందని, తమ పిల్లలకు అక్కడ ఉద్యోగ అవకాశాలు లేకుండా పోతాయనే ప్రచారం సాధారణ ప్రజల మీద అమితంగా పని చేసింది. ఆంధ్ర ప్రాంతంలోని ప్రతి గ్రామం నుంచి కనీసం నాలుగైదు కుటుంబాలకు హైదరాబాదుతో సంబంధం వుంది. అక్కడ ఉద్యోగమో, వ్యాపారమో చేసుకొంటున్నారు. రాష్ట్ర విభజన జరిగితే తామంతా హైదరాబాద్ వదలి వచ్చేయాలనే భయాన్ని సృష్టించారు ఉద్యమకారులు వారిలో. అది సహేతుకమా, అందులో అణువంత నిజం ఉందా అన్న చర్చ పక్కన పెడితే, ఆ భయమే సమైక్యాంధ్ర ఉద్యమాన్ని ఉధృతం చేస్తున్నది మాత్రం నిజం.

## హైదరాబాద్‌పై అపార్థాలు!

సమైక్యాంధ్ర ఎందుకు కావాలనుకొంటున్నావు, రాష్ట్ర విభజన పట్ల నీకున్న అభ్యంతరం ఏమిటి అని ఎవరినైనా అడిగితే వచ్చే సమాధానం – హైదరాబాదులో మనం ఉండడానికి లేదట కదా అన్నదొక్కటే. అంత లోతుగా ప్రజలలో అపార్థాలు బలపడి పోయి ఉన్నాయి.

## తప్పుదారిలో ప్రభుత్వం!

ప్రజలలో ఇటువంటి అపార్థాలు, అపోహలు ఏర్పడినప్పుడు వాటిని పోగొట్టవలసిన బాధ్యత ప్రభుత్వం మీద ఉంటుంది. కానీ దురదృష్టవశాత్తు సమైక్యాంధ్ర విషయంలో సాక్షాత్తు ప్రభుత్వమే ప్రజలను తప్పు దారిలో నడిపిస్తున్నది. అకారణ, అనవసర సందేహాలను వారి మనసులోకి చొప్పించి, ఉద్యమాన్ని తానే ముందు ఉండి నడిపిస్తున్నది. దానితో సాధారణ ప్రజలకు ఏది నిజమో, ఏది దుష్ప్రచారమో తేడా తెలుసుకొనే అవకాశం లేకుండా పోతున్నది. గుడ్డెద్దు చేలో పడినట్లు, సామూహిక హిప్నాటిజానికి గురైనట్లు పొలోమంటూ అన్ని వర్గాల ప్రజలూ ఉద్యమ ప్రవాహంలో కొట్టుక పోతున్నారు.

## ప్రజా నిర్ణయాన్ని మన్నించరా?

ఈ పరిస్థితులలో కేంద్ర ప్రభుత్వం తెలంగాణ ఏర్పాటు ప్రక్రియను సజావుగా నడిపించగలదా అన్నది సందేహం. రాష్ట్రంలోని ఒక ప్రాంతంలో ఒక విధాన నిర్ణయానికి వ్యతిరేకంగా లక్షలాది మంది ప్రజలు ఉద్యమిస్తుంటే, దాన్ని విస్మరించడం ప్రజాస్వామ్య దేశంలో ఏ ప్రభుత్వానికీ వీలుకాని పని. అయితే ఇక్కడొచ్చిన సమస్య ఈ నిర్ణయం పట్ల ఒక ప్రాంతంలో నిరసన వ్యక్తం అవుతుంటే, మరొక ప్రాంతంలో స్వాగతం లభిస్తున్నది. ఏ మాత్రం వెనక్కు తగ్గినా తీరు తిరగబడుతుంది.

సమైక్యాంధ్ర ఉద్యమం కంటే తెలంగాణ ఉద్యమం శక్తి అధికం. ఒక బలీయమైన వాంఛతో ఆరు దశాబ్దాలుగా అందోళన చేస్తున్న తెలంగాణ ప్రజలు, చేతి వరకు వచ్చిన ఫలితం నోటికి చేరేలోగా చేజారి పోతున్నదని తెలిస్తే వూరుకుండలేరు. వారిలో ఈ సారి ఆందోళన కంటే ఆగ్రహం అధికంగా ఉండబోతుంది. అది ఏ విపరిణామాలకు దారితీస్తుందో ఎవరూ ఊహ కూడా చేయలేరు.

## సోనియాలో స్థిర నిర్ణయం

తెలంగాణ ఏర్పాటు ప్రక్రియ జరపలేక, జరపకుండా ఉండనూ లేక సతమతమై పోతున్నది కేంద్ర ప్రభుత్వం. చాలా దురదృష్టకరమైన పరిస్థితి ఇది. అయితే సోనియాగాంధీ మాత్రం తెలంగాణ పట్ల స్థిర నిర్ణయంతో ఉన్నారని చెప్తున్నారు. అందుకు కారణం కూడా సీమాంధ్రులే కావడం గమనార్హం. కేంద్రంలో మంత్రులుగా ఉన్న ఆంధ్ర ప్రాంతం నేతలతో రాష్ట్ర విభజన సంప్రదింపులు జరిపినప్పుడు ఒక్కరు కూడా వ్యతిరేకించలేదు. పై పెచ్చు ఆంధ్ర ప్రజలు విభజనను పట్టించుకోరు అన్న అభిప్రాయం కల్గించారు. కానీ అందుకు విరుద్ధంగా ఇప్పుడు అదే ప్రజలు ఉద్యమిస్తున్నారు. ఊపిరాడకుండా చేస్తున్నారు.

## సిఎం సారధ్యం

అయితే ఇప్పటికే తెలంగాణ విషయంలో కాంగ్రెస్ అధిష్టానం ఒకసారి వెనకడుగు వేసి, పరువు పోగొట్టుకొన్నది. కెసిఆర్ నిరాహార దీక్ష సమయంలో కేంద్ర హోం మంత్రి హోదాలో చిదంబరం తెలంగాణ ఏర్పాటు ప్రకటన చేసి, కాంగ్రెస్ ఎమ్మెల్యేల రాజీనామాలకు భయపడి తన ప్రకటనను వెనక్కు తీసుకొన్నది. ఇప్పుడు రెండవసారి అదే తప్పు చేస్తారా అన్నది ప్రశ్న. ఆ పరిస్థితి తప్పకుంటే కాంగ్రెస్ పరువు గంగపాలు కావడమే కాదు, ఆంధ్ర ప్రదేశ్ చిత్రపటంలో ఆ పార్టీ ఆనవాళ్లు కూడా కన్పించకుండా తుడిచి పెట్టుక పోతుంది. సోనియా గాంధీ చేస్తున్న పెద్ద తప్పు తన పార్టీ వారిని తాను అదుపులో పెట్టుకోలేక పోవడం. తెలంగాణ ప్రకటన విషయంలో ముఖ్యమంత్రి కిరణ్‌కుమార్‌రెడ్డి వైఖరి ముందుగానే అర్థమైపోయింది. కోర్ కమిటీ సమావేశం సమయంలోనే ఆయన రాజీనామా బెదరింపు చేశాడు. అయితే ఢిల్లీ పెద్దలు కిరణ్‌కుమార్ రెడ్డిని తేలికగా తీసుకొన్నారు. లెక్కలో వేసుకోలేదు. ఆ నిర్లక్ష్యమే ఇప్పుడు అధిష్టానం కొంప ముంచింది. సమైక్యాంధ్ర ఉద్యమానికి కిరణ్‌కుమార్ రెడ్డే నాయకుడిగా వ్యవహరిస్తున్నాడు. ప్రతి జిల్లాలో జాయింట్ కలెక్టర్, డిఆర్వో, డిఇఓ వంటి అధికారులను నేరుగా రంగంలోకి దింపి ఉద్యమాన్ని నడిపిస్తున్నాడు. ఎపిఎన్జీఓ అసోసియేషన్ ఆందోళన కూడా ముఖ్యమంత్రి వ్యూహ రచనలో ఒక భాగం అన్న నిజం అందరికీ తెలుసు. ఆయన పానుపున ఉద్యోగులు ముగ్గులోకి దిగిన తర్వాతే ఉద్యమం ఉధృతరూపం ధరించిందన్నది నిజం. ఆ నిప్పును మరింత రాజేయడానికి కిరణ్‌కుమార్‌రెడ్డి నేరుగా జనం ముందుకు వచ్చి, ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి, రాష్ట్ర విభజన అంటే దేశం రెండు ముక్కలు కావడమంత ప్రమాదమనే ధోరణిలో అపోహలు పెంచాడు. పచ్చి అబద్ధాలు చెప్పి ప్రజలను భయపెట్టాడు.

నిజానికి కాంగ్రెస్ అధిష్టానం ప్రకటన పట్ల కిరణ్‌కుమార్‌రెడ్డి స్థాయిలో ఒక ప్రతిపక్ష నేత కూడా స్పందన చూపక పోవడం గమనార్హం. చంద్రబాబు అయితే ఏకంగా కొత్త రాజధానికి ఖర్చెంత అనే లెక్క వేశాడే తప్ప తెలంగాణ ఏర్పాటును వ్యతిరేకించలేదు. వైఎస్ఆర్ కాంగ్రెస్ కూడా మొదటి మూడు, నాలుగు రోజులూ వేచి చూసే వైఖరి అవలంభించింది. తమ పార్టీ వాళ్లే తమమీదకు జనాన్ని ఎగతోలుతుంటే అర్థం చేసుకోలేక పోవడం కాంగ్రెస్ అధిష్టానం వైఫల్యం. ఆ తప్పుకు ఇప్పుడు రాష్ట్ర ప్రజలు భారీ మూల్యం చెల్లించవలసి వస్తున్నది.

## నష్టపోయేది ప్రజలే!

ఈ దశలో ఢిల్లీ సర్కారు విభజన నిర్ణయాన్ని ముందుకు నడిపించినా, వెనక్కు తగ్గినా నష్టపోయేది ఆంధ్రప్రదేశ్ ప్రజానీకమే. ఇక్కడ మంటలు ఆర్పడానికి నీళ్లు చల్లితే అక్కడ ఎగసి పడతాయి. అక్కడ శాంతి కోసం ప్రయత్నం చేస్తే ఇక్కడ పౌర జీవనం స్తంభించి పోతుంది. ఈ సమస్యకు ఒకే ఒక పరిష్కారం ఉద్యమ ప్రాంత ప్రజలలో విభజన ఫలితాలు, ప్రభావాల మీద విస్తృతస్థాయిలో అవగాహన పెంచడం మాత్రమే. రెండు ప్రాంతాల నేతలు, మేధావులు, పత్రికా సంపాదకులు, టివి ఛానళ్ల యాజమాన్యా లను ఒకవేదిక మీదకు తెచ్చి, సమగ్ర చర్చకు శ్రీకారం చుట్టాలి. రెండు ప్రాంతాల ప్రజల మధ్య స్నేహ భావం, సోదర ప్రేమ చెరగిపోక ముందే ఇరు ప్రక్కల ఉన్న అపోహలు, అపార్థాలు తొలగించాలి. తన స్వార్థం కోసం లేక తన స్వంత భావోద్వేగాల వెల్లడి కోసమో ప్రజల జీవితాలతో చెలగాటమాడుతున్న కిరణ్‌కుమార్‌రెడ్డి వంటి పాలకులను పక్కకు తప్పించాలి. రెండు పక్షాలతో ఇబ్బంది లేకుండా రాష్ట్ర విభజన జరపడానికి చర్చ జరగాలి. అంతే తప్ప రాష్ట్రంలో ఏమి జరిగినా మాకు సంబంధం లేదు. మా నిర్ణయం మాదే అనే ధోరణిలో వెళ్లినా, లేక ఆందోళనకు భయపడి వెనక్కు తగ్గినా రాష్ట్రం కోలుకోలేని రీతిలో నష్టపోతుంది.

Edited, Printed and Published by N. Dolendra Prasad. Ph: 091-861-2327354, Offset Printing at Zaminryot Press, Nellore. E-mail : jaminryot@yahoo.com